సంపు. ౨ దుర్మతి: శ్రావణభాద్రపదములు సంచిక. ౩

# సాహితి

సంపాదకుఁడు: తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి



సాహితీసమితి

* తెనాలి *

సంవత్సరపు చందా రెండురూపాయలు: విడిసంచిక ఆఱణాలు
చిఱునామా మారినపుడు చందాదారులు మాకు తప్పక తెలుపవలెను

# శ్రీ గంధిస్తుతి

"వానప్రస్థుఁడు"

శ్రీమద్రాజ్యపదంబు సత్యాగముగఁ సిద్ధింప, నాత్మీయ ని
స్సీమ జ్ఞాన మహాప్రభావిదళిత స్నిగ్ధాస్మదీయప్రజా
వ్యామోహాంధ తమస్కు, సర్వజనతా బంధున్, జగద్భూషణున్,
శ్రీమద్గాంధిదివాకరుఁ, శుభకరున్, సేవింతు నశ్రాంతమున్!

క్షేమస్ఫూర్తి, స్వరాజ్యనామవిలసత్ శ్రీ శీఘ్రసంప్రాప్తికై,
యామోదంబున, భక్తితోఁ, గువలయాహ్లాద ప్రదాన క్రియా
సామర్థ్య ప్రథిమాన దీధితి, నిరుత్సాహాంధకారచ్ఛిదున్,
శ్రీమద్గాంధి కలానిధిన్, గుణనిధిన్ సేవింతు నెల్లప్పుడున్!

# ఉపదేశము

## శ్రీ సురేశచంద్రుని వంగమాతృక కనుసరణము

త్రిపురారిభట్ల వీరరాఘవ స్వామి

అనఁగనఁగా ఒక పావురము. అది ఆకాశము వంకఁ జూచుచుండును. అపుడు దాని దేహము పులకరించును. అది నృత్యముఁ జేయును. అంత దాని హృదయ మానందముతో నిండిపోవును. పగలంతయు నది గానము చేయుచునే యుండును; ఆగానమున కంతము లేదు. ఆకాశమున నెగురుచునే యుండును; దానికి శ్రమ లేదు. ఆ పొదరింటి నుండి యీ పొదరింటికి, ఆ కొమ్మ నుండి యీ కొమ్మకు, ఆ చెట్టు నుండి యీ చెట్టుకు ఎగురుచు వ్రాలుచుండును; దానికిఁ దనివి లేదు.

ఒక రోజున మామూలుగా నృత్యము చేసి చేసి, సంగీతము పాడి పాడి, నీలాకాశమున నెగిరి యెగిరి, యది తన గూటికి తిరిగి వచ్చుచుండఁగా త్రోవలో దాని కొక ముసలిగద్ద యెదురు పడెను. ఆ గృధ్రము మూడువంతుల వయస్సు కడచినది. అది యా పావురమును బిలిచి, "ఓరీ, క్షుద్రపక్షీ! ఇటు వచ్చి నా ముందు కూర్చుండుము," అనెను. చీకుగద్ద పల్కిన గర్వోక్తిని దిరస్కరింపలేక పావురము దానిముందుకు వచ్చి కూర్చుండెను. గృధ్రము మరల నిట్లనెను: "ఓరీ, క్షుద్రపక్షీ! చపలచిత్తా! వీవే పెడత్రోవల సంచరించి వచ్చుచున్నావురా? ఓరీ, దుర్బుద్ధీ! ఏ దురాశచే అంతులేని సముద్రములను తెప్పలేకుండ నీదఁ దలఁచినావురా?"

చీకుగద్ద పల్కిన కఠోరవాక్యములు చెవినిబడి నంతనే పావురపు హృదయము దడదడ మని కంపించెను. త్వరలో నేదో యొక ఆపత్తు వచ్చునని దానికి భయము కలిగెను. అంతదాని యానందోత్సాహము లంతరించెను. తొట్రుపాటుతో నది 'ప్రభూ,—' అని యేదో యనఁ బోయెను; కాని దానికి నోట మాట రాలేదు. అది నిలువున వడఁక సాగెను.

గృధ్ర మిట్లనెను: "ఓరీ, మూఢ! నీ కిపుడు ధర్మోపదేశము చేయుదును, జాగ్రతగా విను. నీవు మా కంటఁబడుట కేవలము నీ భాగ్య మనుకో. నీ నృత్య మతిపాపము. నీ గాన మతినీచము, నీ యాకాశవిహారము కేవలము దుష్కార్యము.

"దుష్కార్యమా, ప్రభూ!"

"దుష్కార్య మన్న దుష్కార్యమా! ఇట్టి దుష్కార్య మీ జగత్తులో నింకొకటి లేదు."

గృధ్ర ముపదేశించిన ధర్మమునకును తన యనుభవమునకును పావు

రము సంబంధము కుదుర్చుకో లేక పోయెను; అది యాధర్మము సత్యమని కూడ నమ్మలేకపోయెను. అయితే వయస్సుముదిరినది, అనుభవము కలదియగుటచే నా ముసలిగద్ద జ్ఞానికావచ్చుననుకొని దాని వాక్యములం దది విశ్వాస ముంచ సాగెను.

"ప్రభూ! ఎగురుటయం దానందమే లేదా?" అని పావుర మడిగెను.

"ఆయానంద మీశ్వర మార్గమున కంతరాయము."

"ఈశ్వరుఁ డెవరు, ప్రభూ!"

"వత్సా! శ్రద్ధగా విను. ఈశ్వరుఁ డానందమయుఁడు. ఈజగత్తును సమస్త బ్రహ్మాండమును సృష్టించిన దతఁడే"

గృధ్రవాక్యములు విన్నంతనే పావురమునకు హృదయ ముప్పొంగెను. అంత నది యేదియో చెప్పఁబోవుచుండ దాని మాట కడ్డువచ్చి మరల గృధ్ర మిట్లనెను: "వత్సా! ఆయీశ్వరుఁ డొక్కఁడే సత్యము, ఈ జగత్తు అంతా మిథ్య." ఈమాటలు విన్నంతనే పావురము నిర్విణ్ణ మయ్యెను. మరల గృధ్రి మిట్లు చెప్ప సాగెను: "వత్సా! జాగ్రతగా విను. నిరాకారుఁ డైన ఈశ్వరుఁడు సత్యము, సాకారుఁ డైన ఈశ్వరుఁడు మిథ్య. నిరాకారుఁడైన ఈశ్వరుఁ డానందమయుఁడు, సాకారుఁ డైన ఈశ్వరుఁడు దుఃఖమయుఁడు. జగమునందు సుఖదాయకము, ఆనందదాయకము అయినది ఏదైన కొంచెముండిన అదంతయు మాయావిలాసము అని తెలిసికో. ఇంతే కాక జీవనమున సరలము, సహజము, స్వతఃసిద్ధము అయినదెల్ల ఈశ్వరమార్గమున కంతరాయ మైనది. జీవనమున ప్రేమింపఁదగిన దని తోఁచిన దెల్ల విషమువలె త్యజింపవలెను. కారణమేమన, ఈశ్వరుఁడు సేవింపఁదగినవాఁడు, కాని ప్రేమింపఁ దగినవాఁడు కాఁడు."

గృధ్రి వాక్యములు పావురమున కర్థము కాక పోఁగా దాని మనస్సునకు మరింత విచారమును కల్పించెను. అంత నది ఇట్లనెను:

'అయితే, ప్రభూ! ఏమి చేయమంటారు?"

"మిథ్యామార్గమును వదలిపెట్టు. ఇక ఎగుర వద్దు."

"ప్రభూ! తమ రెన్నఁడు ఎగురనే లేదా?"

"ఎగిరిన మాట నిజమే. కాని ఏమి చెప్పుదు: మా కపుడు సదుపదేశము చేయువారు లేకపోయినారు. నీకు మా సదుపదేశము లభించుట కేవలము నీ యదృష్ట మనుకో."

"రెక్కలెగురఁ గోరుచున్న వే, ప్రభూ!"

"అందు కుపాయ మున్నది. నీవు నీ గూటికిఁ బోయి ఎగురుట కేమాత్రము వీలు లేకుండ రెక్కలను బంధించికొనుము. వత్సా! పోయిరమ్ము. ఈశ్వరుఁడు నీకు శుభ మిచ్చును. పొమ్ము."

విరిగినమనస్సుతో కపోతముతనగూటికి వెడలిపోయెను. దాని కనులలోని తేజ

మారిపోయెను. మెల్లగా దాని మనస్సులోని యానందము నెవ్వరో బలవంతముగా నపహరించినట్లయ్యెను. దానికి జీవనము దుస్సహ మయ్యెను. ఆహా! బ్రతు కింత దుఃఖమయమా! అపుడీ ప్రాణ ముండి ప్రయోజన మేమి? ఇది పోవుటే సుఖదాయకము!

అంత నా కపోతము తన గూటికేఁ రెక్కలను గట్టిగా బంధించుకొని 'మిథ్య, మిథ్య'యని జపింప నారంభించెను. రెక్కల బాధచేతను, దుశ్చింతలచేతను దాని కా రాత్రి నిద్ర పట్టలేదు. ఎంతో కష్టము మీద నది మూడు జాముల రాత్రి గడపెను.

తెల్లవారు జామున నా కపోతము కనులుమూయు నప్పటికి, పూర్వదిగంచలము వీడి అహర్దేవి సింధుతరంగముల మీదిగా ధీరమంథరగమనముతో ధరిత్రీజడత్వమును బాప నేతెంచుచుండెను. ఉషఃస్పర్శచే వనములందు కుందమందారములు ఆనందాతిశయమును భరింపలేక పొట్ట చెక్కలగునట్లు నవ్వుచు పుష్పించెను. భృంగఝంకారమునకు విరామమే లేదు. మధురగానము లొనర్చు విహంగకంఠముల కలసటలే లేవు. కలరవ ములికిపడి లేచి క్షణమాత్రము రెక్కల బాధను మరచెను. అంత నది తలయెత్తి శాంతము అనంతము నగు నీలాంబరమును వీక్షించెను. దాని కపుడు మారుతముల ఉన్మత్తవిహారమును, కుసుమముల సంఫుల్లహాసమును, విహంగముల క్రీడోడ్డీనములను గోచరించెను. అకస్మాత్తుగా దాని కన్నులు బాష్పపూరితము లయ్యెను. హా! నేను కలగనుచు మిథ్యామార్గమును త్యజించినది, పరమధర్మమును స్వీకరించినది!

ఈరీతిగా నా కపోతము దినములు కడపుచుండెను.

ప్రతిప్రభాతము నందును అది కనులఁ దెరచును; దాని హృదయము కంపించును; రెక్కలు చలించును; కన్నుల నీరు క్రమ్మును. అది ఇట్లనుకొనును: హా! ఈశ్వరా! నాపై నింత కాఠిన్య మెందుకు! ఈయాకాశమున నెగురుచు నీ నామము స్మరించుట అతిసహజకార్యమగును గదా! ఈమందానిలములో నూగుచు నిన్నుఁ గీర్తించుట ఆనందదాయక మగును గదా! ఇపుడు నాకీ దుఃఖమేల కలుగవలెను? నా కోరిక ఈశ్వరమార్గమున కభ్యంతర మెట్లగును? నేను ప్రేమించినది మిథ్యయెట్లగును? అకటా! ఇంత నిర్దాక్షిణ్యము, ఇంత నైష్ఠుర్యము ఈశ్వరున కెందుకు?

అభ్యాసముచే నేది సాధ్యము కాదు! క్రమక్రమముగా పావురమునకు రెక్కలు స్వాధీనము తప్పిపోయెను. దాని హృదయమున చీకటితెర క్రమ్ముకొనెను. దాని అంతఃకరణప్రవృత్తులు నశించెను. దానికి అసంతుష్టి యెక్కువయ్యెను, ఓర్పు తూలిపోయెను, నిరాశ మెండయ్యెను, జీవనభారము దుస్సహమయ్యెను.

కపోత మీరీతిగా దినములు కడపుచుండెను. ఈ రీతిగా కొన్ని వసంత

ములు వల్లీపల్లవములతోడను, సువాసనావికాసములతోడను, కుసుమఫలములతోడను, క్రీడోత్క్షేపములతోడను, కలరవగానములతోడను వసుంధర నలంకరించి దాటి పోయెను.

ఒకనొక ఫాల్గునప్రభాతమున పావురమునకు తన హృదయములో బహుదినరుద్ధ మగు కవాట మొకటి తెరచినట్లయ్యెను. అచట నేదో యజ్ఞాతలోకపు పద్మ మొకటి వికసించి నిజసౌరభముచే దానిని మోహపెట్టెను. దాని నేత్రముల కేదో నూతన ముఖ్యది నట్లయ్యెను. అపుడొకసారి అది ప్రకృతిని వీక్షించెను. జగత్తు దానికి కేవలము దుఃఖమయముగా గనబడ లేదు. జగమునందు గూడ దానికపుడు మాధుర్యము, సౌందర్యము, ఆనందము నున్నట్లు గోచరించెను. కపోతాంగన కంటె వేరొక సుందర వస్తువు లేదని దానికపుడు పొడకట్టెను. రహస్యకాంక్ష యొకటి దానిని అహోరాత్రములును పారావతివైపున కాకర్షించుచున్నది కాబోలు! కపోతీహృదయమునకు దన హృదయమును మనసార మేళవింప దలచి అది గృధ్రము కడకు బోయి, "ప్రభూ! నేను వివాహ మాడెదను" అని పలికెను.

"వివాహము!" అను మాట విన్నట్లు గద్ద నమ్మలేకపోయెను.

"వత్సా! ఏమంటివి?"

"ప్రభూ, నాకు వివాహమాడవలెనని కోరికకల్గినది"

"ఇదేమిటి? ఇన్ని నాళ్ళనుండి నీకుపదేశించిన ధర్మమిదేనా? వత్సా! వినుః స్త్రీకంటె మహాపాతకురాలు ప్రపంచములో నింకొకటి లేదు. ఈశ్వరసాధనకింతకంటె విఘ్నకారిణి మరొకటిలేనే లేదు. అట్టి స్త్రీని గూడినరకమునకుం బోకుము"

"ప్రభూ! తమ రెన్నడును వివాహమాడనే లేదా?"

"వివాహ మాడినమాట వాస్తవమే కాని మా కపుడు సదుపదేశము——అదంతా ఇపుడెందుకు! నీవుచాలా అదృష్టవంతుడవు. పో. నీగూటికి పో. వివాహసంకల్పమునూను. ఈశ్వరసాధన చేయుము. భగవానుడు నీకు సద్బుద్ధి నిచ్చును పొమ్ము."

కలరవమునకు హృదయముపై హిమాద్రి వంటి భారముపడి నట్లయ్యెను. తన గూటికది తిరిగిపోయెను; ఇంకేమి చేయును! కపోతిపై వాంఛ నది ఎంతగా త్యజింపనెంచునో, అంతగా నా కపోతాంగనాకమనీయమూర్తి దానిమనోనేత్రమునకు బ్రత్యక్షమగుచుండెను; అంతగా తన్మాధుర్యము దానిహృదయమునకు లాలిత్యమును గూర్చుచుండెను. తనహృదయములో నుండి కామోత్కంఠితమగు నార్తస్వరముతో నెవరో దానిని బలుమారు పిలచి, "అయ్యా, నాకు కావలెను, నాకా కపోతాంగన కావలెను" అని ప్రార్థించి నట్లుండెను. హృదయపూర్వకముగా నది మిథ్య మిథ్య యని ఎంతగా జపించునో, అంతగా దా

నిహృదయములో నుండి 'నేనున్నాను నేనున్నాను 'అని యెవరో ఘోషిల్లు చున్నట్లుండెను

ఆహా! ఎంతగొప్ప చిక్కు వచ్చినది? ఒకవైపున స్త్రీవాంఛ, ఇంకొకవైపున ఈశ్వరసాధన! ఈశ్వరసాధనకు స్త్రీ అంతరాయమైతే, జీవునకీద్రోహబుద్ధి ఎందుకు? ఈశ్వరుఁడేదికోరఁడో, ఈశ్వరానందమున నేదిమిథ్యయో, దానియందు జీవునకింతకాంక్ష ఎందుకు? అట్టిదుర్లభమైనపదార్థముతో నెట్లుతృప్తి కలుగును? హా! ఈదురవస్థయెవరికి దెలియును?

రోజులకు రోజులు కడచినవి; పావురమునకు మాత్రము అంతఃకలహము తుదముట్ట లేదు. నిశ్చేష్టతయు, నిష్ఫలతయు, తీవ్రయాతనయు సర్వదా దానిహృదయము నావరించియే యుండెను. దాని కిక శక్తి లేదు; దాని కన్నులు నల్లబడెను; జీవనము లక్ష్యహీనమయ్యెను; మరణవాంఛ మిక్కుటముకా సాగెను. అది గృధ్రము కడకుఁ బోయి, "ప్రభూ! నాకు ముక్తి దయసేయండి, వివాహ మాడ అనుజ్ఞ నీయండి" అని ప్రార్థించెను. దాని దురవస్థను గ్రహించి గృధ్ర మిట్లనెను:—"సరే, నీవు పోయి పెండ్లిచేసుకో, కాని స్త్రీ యెడల జాగ్రతగా ప్రవర్తించు. దాని మోహములోఁ దగుల్కొనకు; వనితా - సంయోగము ఆనందదాయకమని యెంచెదవు సుమీ; అట్లయిన నీవీ జన్మమునకు ఈశ్వరానందమును బోఁగొట్టుకొందువు."

పావురము తన గూటికి పోయెను, ఎండిపోవుచున్న దాని జీవనసరిత్తుకి బహుకాలము తరువాత వెల్లువ వచ్చినట్లయ్యెను. దాని హృదయతరంగిణిలోని ప్రాణఘట్టములం దానందలహరి కలకలధ్వనిఁ జేయ నారంభించెను. దాని జీవనములోని సమస్తగ్లానియు, సమస్తదైన్యమును వదలి పోయెను. పావురమిపుడు వెనుకటి పావురము కానట్లుండెను. ఎపుడు దానికీ పునర్జన్మము మెత్తినట్లైనదో, అపుడే అది క్లాంతినిఁ బాసి శాంతిని, భ్రాంతినిఁ బాసి జన్మస్వాతంత్ర్యమును బొందెను. అది వివాహ మాడెను.

కాని కపోతమునకు సంకటము తీర లేదు. జీవన మింత హాస్యాస్పదమా, లేక జీవునకు ఈశ్వరునకు వైరమా? ఈశ్వరున కింత క్రోధమా, లేక జీవునకనాదిసిద్ధమైన ద్రోహమా?

పారావతము పారావతిని హృదయమున హత్తుకొని ఎప్పు డానందమున నోలలాడెనో, అప్పుడే దానికి ఈశ్వరుని అస్తిత్వము కొంచెముగా స్పష్టపడెను; అప్పుడే దానికి కొంచెము జ్ఞానము కలిగెను. కాని, ఆహా! జ్ఞాని యగు గృధ్రము ఈ యానందము అధఃపతనమునకు మూల మనియు, ఈశ్వర సాన్నిధ్యమునకు దూర మనియు, ఉపదేశించెను గదా! హా! పాపిష్ఠిదైవమా! హా! హతవిధీ!

కాలక్రమమున పావురమునకు సంతానము కలిగెను. యుక్తవయస్సున

ధాన్యం ఎవరో తోడుతూవున్నట్టు అనుమానం తట్టింది. నెమ్మదిగా లేచి మా అత్తను లేపి యింట్లో చూచోమని చెప్పి, కిక్కురుమనకుండా పెరటితలుపు తీశాను. తీసి చేత్తో కర్ర గట్టిగా పట్టుకొని అవతలకు అడుగు వేశాను. ఆ అలికిడి గ్రహించి ఇద్దరు మనుష్యులు తట్టలు చేత్తో పట్టుకొని పెరటిగుమ్మము వైపు పరుగెత్తేరు. నేను వాళ్ల వెంట బడ్డాను. పెరటిగుమ్మము దాటి నేనూ ఇవతలకు వచ్చేసరికి వాళ్ల జాడ తెలియలేదు. అడుగులజాడను పట్టి వెళ్లుదామని బయలుదేరేను. కాని వీధిఅంతా అడుగులమయమూ పశువులరొచ్చూ ఏమి తెలిసింది కాదు. అయినా ఊరువెలపల చెరువుకేసి పరిగెత్తివుంటారని వూహించి ఆవైపు వెళ్ళేను. చెరువుగట్టెక్కి నాలుగువైపులా చూశాను కాని ఎక్కడా మనిషిజాడ కనపడలేదు. ఇంక ఒక్కడినీ ఎక్కడికి వెళ్ళడం అని యింటివైపు మళ్ళేను. త్రోవలో మునసబు ఇంటిదగ్గిరవాళ్ళను లేపి సంగతి అంతా చెప్పి యింటికి వెళ్ళిపోయినాను. ఇంటికి వెళ్ళేటప్పటికి ఏడుపులు పెడబొబ్బలూ నేను పెరట్లోకి వెళ్ళడంతోనే ఎవడో యింట్లో ప్రవేశించి దేవతార్చన అరుగుమీద వున్న దేవతార్చనపెట్టె పట్టుకొని పారిపోయేడట భయంచేత మా అత్త కేకసయితం వెయ్యలేకపోయిందిట. నాకుచాలాఆశ్చర్యంవేసింది. ఇంట్లో దొంగ పడివేసిస్తే బంగారం వెండీ తీసుకుపోవడం కద్దు కాని దేవతార్చనపెట్టె ఎత్తుకుపోవడమేమిటి? పెట్టెలో త్రిపురసుందరియంత్రం ఒకటున్నది. అదిచాలా అమోఘమైనదని అందరికీ తెలుసును. దాన్ని పూజించేవారికి సిరిసంపదలకు లోటుండదు. కాని ఆ యంత్రం నాదగ్గర వుండాలి లేకపోతే నావంశస్తులదగ్గర వుండాలి. ఇంకొకరి దగ్గిర వుంటే అదిపనిచెయ్యదు సరిగదా నెత్తి అడుస్తుంది. ఆసంగతి తెలియక తీసుకుపోయినట్టా? లేకపోతే నాదగ్గిర ఆయంత్రము వుండడమేమని దుగ్ధకొద్దీ తీసుకుపోయినట్టా? అయితే గాదెలో వడ్లు తోడడం ఎందుకూ? వడ్లకోసం వస్తే దేవతార్చనపెట్టె ఎందుకు? పెట్టెకోసం వస్తే వడ్లుతోడడం ఎందుకు.

నాకు ఏమీ తోచింది కాదు. అమూల్యమైనయంత్రము పోయిందని జిజ్ఞాస మనస్సుకు పట్టింది. నాయింట్లో దొంగతనం చెయ్యడమా అని అభిమానం కలిగింది. దానాదీనా దొంగను పట్టి తగినశాస్తి చెప్పవలెనని దృఢసంకల్పం చేసుకున్నాను".

౨

ఇంతట్లో మా అత్త ఫలహారం తీసుకువచ్చింది. వేచినఅటుకులూ అరటిపండ్లూ పళ్లెంలో తెచ్చి మాముందు పెట్టి, అదేమిటే బుల్లెమ్మా, బావ ఒళ్లో కూచున్నావు. అతనికాళ్లు నొప్పు

కొట్టవూ?" అన్నది.

బుల్లెమ్మ తలవంచుకుని "పట్టవు" అన్నది.

"కూచుంటే నేమి? కూచోనియ్యి," అన్నాను.

"లే అమ్మా లే! నాన్నగారిబల్లో కూచో. లేకపోతే పెరట్లో మిరపకాయలు ఎండబోశాను. కాస్త కాకులిని కొట్టకూడదూ"

"నేను బావబల్లోనే కూచుంటాను" అని మూతిముడిచి తల ఒకవేపుకు త్రిప్పి అన్నది బుల్లెమ్మ.

"అతగాడితో కబుర్లు చెప్పేబదులు కాస్త తోటకువెళ్ళి మామిడికాయలు రాలిపోతూన్నాయిట. అవి దింపించి యింటికి తీసుకు వస్తే ముగ్గేసుకోవచ్చు గదా. ఆడదాన్ని నే చెప్పాలా!" అన్నది మాఅత్త మామామ కేసి తిరిగి.

"అలాగే వెడుదూ" అన్నా డాయన. మాఅత్త వెళ్ళిపోయింది.

"విన్నావుటోయి. ఆరాత్రి ఎలాగో గడిపి ఉదయాన దొంగతనం సంగతి, పరిశీలన చేశాను. గాదెలో వడ్లు ఏమీ తరిగినట్టు లేవు. తాళంమాత్రం తీసివున్నది. కాని గాదెకింద ఒకచెప్పులజోడు దొరికింది. జోడుకాదు. ఒకచెప్పు. రెండవది అక్కడ లేదు.

"ఇంట్లో దేవతార్చన అరుగుదగ్గర అంతా చూశాను. ఏమీ విశేషాలు తెలియలేదు. కాని లోపల ప్రవేశించిన మనిషి కాలినుంచి రాలినమట్టిపెల్లలు మాత్రం అవుపించినవి. ఆమట్టిపెల్లలు తీసిపరీక్షించాను కాని పెరట్లో మట్టికీ వానికీ భేదం ఏమీ కానరాలేదు. అయినా చూతామని కాలినుంచి రాలిన మన్ను ఒకచెంబులో నీళ్ళుపోసి అందులో వేశాను. పెరట్లో పయినున్న మన్ను కాస్త యింకో చెంబులో నీళ్ళుపోసి అందులో వేశాను. సాయంత్రందాకా వుంచి చూసేసరికి కాలినుంచి రాలినమట్టిలో ఇసుకఎక్కువ చెంబుఅడుగుకు చేరినట్లుకనుక్కున్నాను. అయితే ఈఆధారాన్ని బట్టిచూస్తే ఇసుకలో నడచినపాదాలతో మన్నుమీదనడిస్తే ఆమన్ను కాలికి పట్టుకొని వుండవలె; లేదా యిసుకపాలు ఎక్కువగావున్న మట్టిలో నడిచినప్పుడు ఆమన్ను కాలికి పట్టుకొని వుండవలె దీన్ని అనుసరించి ఏవిధంగా వూహించడానికీ పాలుపోయిందికాదు. సరే రెండవఆధారం వుందికదా అనుకున్నాను. అనుకొని చెప్పు తీసుకొని పరీక్షించినాను. సాధారణముగా పల్లెటూళ్ళవాళ్ళు పొలాలలోనూ ఇంటివద్దా వుపయోగించేదే అది. అందులో విశేషము ఏమీ లేదు. చెప్పుకు మీసములు వుండడంవల్ల పొలాలలో తిరిగే వాడిది అని గ్రహించాను. కాని చెప్పు పాతది. అడుగుభాగం అంతా అరిగిపోయినది. కాని కొత్తప్పుడు మంచి నాజూకైనదిగా కనుపించింది. మోటుది కాదు. చెప్పులో మనిషి పాదం ఎంతవరకు మోపబడివున్నదని చూశాను. పాద

మంతా మోసింది కాని కొంతమట్టుకు మడమచివరభాగం మోసినట్టు కనుపించలేదు. దానిని బట్టి చూస్తే ఎవరో నాజూకైనచెప్పులజోడు కొనుక్కొని అది చాలాకాలం వుపయోగించి పాతదైన తర్వాత దగ్గిర పనిచేస్తున్న కూలివాడికో పాలేరువాడికో ఇచ్చివుండవచ్చునని తోచింది.

"ఈప్రాంతాలను నాజూకైన చెప్పులుకుట్టేవాడు గురవడుతప్ప ఇంకెవరూ లేరు. గురవడు ఇక్కడకు నాలుగుమైళ్లదూరంలో వున్న మాదిగగూడెంలో వున్నాడు. వాడిని, పిలిపించి, "గురవా, నీచేత సాధారణంగా ఎవరెవరు చెప్పులు కుట్టించుకుంటారురా" అని అడిగేను. పక్కనున్న పల్లెటూరిబ్రాహ్మణులందరూ కుట్టించుకుంటారన్నాడు, వాడుకగా ఎవరు కుట్టించుకుంటారు అని అడిగినాను. బూరపల్లెలో సుబ్బయ్యగారు, బొల్లారులో వెంకయ్యగారూ ప్రతియేడూ కొత్తజత కుట్టించుకొని ఒక పాతబట్టా ఒకరూపాయీ యిచ్చేవాడుక అని తేలింది.

తరవాత చెప్పు ఏభాగం ఎక్కువ అరిగింది అని చూశాను.

"ఆపరీక్ష ఎందుకు" అన్నాను. అప్పుడప్పుడు రెండుమూడు ప్రశ్నలు వేస్తూవుండవలె గాని వూరుకుంటే బాగుంది కాదని అడిగినాను.

"చెప్పు అరుగుదలనుబట్టి మనిషి సంగతి కొంత తెలుస్తుంది. చెప్పువెలుపలిభాగం అరిగినట్లయితే దొడ్డికాళ్ళవాడు కావచ్చును. చెప్పులోపలిభాగం అరిగినట్లయితే ముడికాళ్ళవాడు. సమంగా అరిగితే సాధారణుడు. ఈవిషయంలో చెప్పువెలుపలిభాగం ఎక్కువగా అరిగినందువల్ల దొడ్డికాళ్ళవాడు కావచ్చుననుకొన్నాను.

ఈదొడ్డికాళ్ళవాడు అసలుయజమానో లేకపోతే పాలేరువాడో ఏలాగు తెలియడం?

అరుగుదలనుబట్టి జాగ్రత్తగా పరీక్షించిచూస్తే కొత్తఅరుగుదలకు పాతఅరుగుదలకూ తేడా తెలుస్తుంది. ఈవిషయంలో కొత్తఅరుగుదలనుబట్టి పాలేరువాడనుకుందాము. ఆమనిషి దొడ్డికాళ్ళవాడని తెలిసింది, తరవాతమంటిలో పడినచిహ్నాలు, చెప్పులజాడలు పరీక్షించాను. గాదెవైపుకు వస్తూన్నజాడలనుబట్టిచూస్తే అవి చెప్పులజాడలవలెనున్నవి కాని పాదచిహ్నములవలె లేవు. ఆజాడలు భూమిలోకి లోతుగా దిందుకుపోయి వున్నవి. దానినిబట్టి ఆచెప్పులు తొడుగుకున్నవాడు బరువు మోస్తూ గాదెవేపు వచ్చివుండాలి లేదా స్వతసిద్ధముగా స్థూలకాయుడై వుండాలి. గాదెనద్దకు బరువు మోసుకు రావడం అసంభవము. ఏమంటావు?

"సరే! కాని యిద్దరుముగ్గురు వచ్చారుగదా. అందులో ఎవరిచిహ్నాలో ఎలాగ తెలియడం?"

"దేవతార్చనపెట్టె తీసుకుపోయినవాడికి చెప్పులు లేవు. మిగిలిన యిద్దరిలోనూ ఒకడుమాత్రమే చెప్పులు

డుగుతున్నట్లు చిహ్నాలవల్ల తెలిసింది. రెండవవాడికి చెప్పులు లేవని తనుచిత చిహ్నాలు లేకపోవడంవల్ల తేలింది. సరే ఇంతమట్టుకు తేలిందేమిటి? దొడ్డికాళ్ళవాడు, స్థూలకాయుడు వచ్చిన వాళ్ళల్లో ఒకడని తెలిసింది.

"తరవాత పాదప్రమాణము తెలుసుకున్నాను. చెప్పులో పాదచిహ్నం వుంటుంది కాబట్టి దాన్నిబట్టి పాదప్రమాణము తెలుసుకోవడంలో కష్టం లేదు. అది తొమ్మిది అంగుళాలని జ్ఞాపకం.

"దానివల్ల లాభం ఏమిటి?"

"పాద ప్రమాణాన్నిబట్టి మనిషి ప్రమాణము అనగా ఎత్తు తెలుసుకోవచ్చు?

· "ఎట్లా!"

"పాదప్రమాణానికి దాదాపు ఆరున్నర రెట్లు మనిషిపొడుగు ఉంటుంది. ఈమనిషిపాద ప్రమాణము ౯ అంగుళములు కాబట్టి పొడుగు ౫౭ అంగుళములు అనగా ౪ అడుగుల ౪ అంగుళములు. పొట్టివాడన్నమాట."

"సరి. ఒకమనిషిసంగతి చాలా మట్టుకు తెలిసినట్టే."

"ఏమి తెలిసింది. దొడ్డికాళ్ళవాడనీ లావైనవాడనీ, పొట్టివాడనీ అంతే. అలాంటివాళ్ళు చాలామంది చాలా చోట్ల వుండవచ్చును. ఈమనిషి ఫలానా అని తెలుసుకోవడం కష్టం. దానికోసం ఏమిచేశానంటే తొడిగినప్పుడల్లా పాదం మోపుతూవుండడం వల్ల ఆపాదానవున్న సన్నమన్ను చెప్పుకు పట్టుకొనివుంటుంది. ఆమన్ను తీసి చూచినట్టయితే ఆమనిషి ఏయే చోట్ల సాధారణంగా తిరిగేదీ తెలుస్తుంది. ఎర్రమన్నులో తిరిగేవాళ్ళ చెప్పుకు ఎర్రిమన్ను పట్టుకొని వుంటుంది. ఇసుకలో తిరిగేవాళ్ళకు ఎక్కువగా ఇసుక చెప్పుకు పట్టుకొని వుంటుంది. ఈ చెప్పుకు పట్టుకొన్న మన్ను కొంత గోకి నీళ్ళల్లో పడవేసి చూశాను. అది రేగడిమన్ను కొంచెము ఇసుక కూడా వున్నది. దానిని బట్టి నేను వూహించిన దేమిటంటే ఈమనిషి సాధారణంగా పొలాలలో పనిచేసేవాడనీ, అప్పుడప్పుడు ఇసుక భూమిలో కూడా తిరుగుతూ వుండే వాడనీ. ఈ అభిప్రాయం యదార్థము అవునో కాదో తెలుసుకోవడానికి చెప్పు తీసుకొని దానిపైభాగాన వున్న సన్ననితోలు ముక్కలు ఎత్తి చెప్పుదులిపినాను. నేను అనుకున్నట్లుగానే యిసుక రేణువులు క్రింద రాలేయి ఆయిసుక తీసిచూస్తిని. వాగులు పారినతరువాత ఎండిపోతే అక్కడ నిలిచివుండే ఇసుకవలె వున్నది. అప్పుడు ఆలోచించాను. వాగులు ఎక్కడవున్నాయని. బొల్లారుకు ఈవూరుకూ మధ్య వాగు వున్నది. ఏఒకమాసంలోనో దానిలో నీళ్ళు వుంటవి గాని సాధారణంగా సంవత్సరంపొడుగునా అది ఎండివుంటుంది. బొల్లారివాళ్ళు పొలానికి వెళ్ళడానికి ఈవాగుదాటుతూ

వుండాలి. అట్లా దాటుతూవుండే వాళ్ళ చెప్పుల్లో ఇసుక దూగడం విశేషమేమిటి?

"మరునాడు నేను బొల్లారుప్రయాణమై వెళ్ళేను. వూరంతా ఏమీ పనిలేనివాడిలాగ తిరిగేను. నే ననుకున్న మనిషి ఎక్కడైనా కనిపిస్తాడేమో అని మాత్రం పరిశీలిస్తున్నాను. ఒకవీధిలో వడ్లకావిళ్లు మోస్తూ కొందరుమాలవాళ్లు రావడంకనిపెట్టినాను. అందులో పొట్టివాడూ, దొడ్డికాళ్లవాడూ, స్థూలకాయుడూ అయిన ఒకమాలవాడు కనబడ్డాడు. తక్షణం ఆవూరి కరణంగారిదగ్గిరకు వెళ్లి జరిగిన సంగతి చెప్పి వాడిని పిలిపించమన్నాను. నన్ను ఎరిగినవాడే కావడంమూలాన ఆయన మాలవాడిని పిలిపించేడు. వాడు నామొగం పరకాయించిచూడడంతోనే కొంచెము జంకేడు. అది నేనుమాత్రమే కనిపెట్టేను.

"ఇంక చెప్పే దేమిటి? వాడు సర్వమూ వప్పుకొన్నాడు. ఆవూళ్లో వెంకయ్యగారి దగ్గిర నౌకరీచేసేవాడట తాను. వెంకయ్యగారింటికి ఆయన దూరపు బంధువు అనగా ఒకవేలువిడిచిన మేనత్తకొడుకు కొన్నాళ్లనుంచీ వచ్చివున్నాడుట. అతనిప్రవర్తన మంచిదికాదు. అతగాడు మంత్రశాస్త్రంలో కొంచెంపరిచయం కలగజేసుకొని త్రిపురసుందరియంత్రం నావద్ద వున్నదని విని అది తస్కరించవలెనని మరూహాతో ఆనాటిరాత్రి ఇద్దరుమాలవాళ్ళను వెంటబెట్టుకొని వచ్చినాడట. మాలవాళ్ళిద్దరినీ గాదె తలుపులు తీసి వడ్లు తోడుతూన్నట్లు చప్పుడు చెయ్యమన్నాడు, తాను వెరటివసారా గుమ్మందగ్గిర దాగివున్నాడు. అతగాడు అనుకున్నట్లే నేను చప్పుడు వినగానే వాళ్ళవెంట పరుగెత్తుకువెళ్ళేను. అతగాడు లోపల ప్రవేశించి యంత్రం అపహరించినాడు. ఇదీ సంగతి. తరవాత ఆదుర్మార్గుడికోసం కబురుపంపించమన్నాను కరణంగారిని. అతగాడు వచ్చి చాలాసేపు నాతో వాదించి తనకేమీ తెలియదన్నాడు. నాకు కోపం వచ్చి గట్టిగా చెయ్యిచేసుకునేటప్పటికి అతడు అంతా వప్పుకొన్నాడు. చెరువులో యంత్రం పాతిపెట్టినాడట. అప్పుడే అతన్ని ఇద్దరినీ జతయిచ్చి పంపి యంత్రం తెప్పించినాను."

"వాళ్లను పోలీసువాళ్లకు అప్పచెప్పావా?"

"పల్లెటూళ్లలో అలాంటి అలవాటు లేదు. పోలీసువాళ్లకు అప్పచెప్పడంవల్ల డబ్బుతట్టుబడీ శ్రమా తప్ప న్యాయం జరగదు. ఆకారణంచేత మేమే వాళ్లనితగిన రీతినిశిక్షించాము. మాలవాళ్ళిద్దరకీ పదేశిరూపాయలు జులమానా విధించాము. బ్రాహ్మణుని నలుగురువద్దా తలవాచేటట్టు చీవాట్లుపెట్టించి ఏభైరూపాయలు జుల్మానాకింద వసూలుచేసినాము. ఈ డెబ్భైరూపాయలూమార్కండేయస్వామివారి ఆలయం బాగుచెయ్యడానికి వినియోగించాము."

"మళ్ళీ వాళ్ళుఅలాంటిపనులుచెయ్య

లేదుగదా?"

"చెయ్యడమే? మాలవాళ్ళకు నౌకరీపోవడంవల్ల ఆవూరినుంచి లేచి పోయారుట. బ్రాహ్మణుడు ఎక్కడకువెళ్ళేడో నాటికీ నేటికీ అతీగతీ లేదు. విన్నావూ మరి ఎంతపని చేశానో! యంత్రం పోవడం వల్ల ఇంతగా పనిచేశాను కాని యితరం అయినట్లయితే వూరుకునే వాడనే. నీవు చదివే నవలలో అపరాధాలు కనుక్కోవడానికి ఏమైనా సూక్ష్మ విషయాలు వుంటవా?"

"నీవు చేసినట్లే వుంటుంది కొంచెం హెచ్చుతక్కువగా."

"లే, మరి. ఒకమాటు తోటకు వెళ్ళివత్తాము. వస్తావా?"

"నీవు నడుస్తువుండు అన్నట్టు అడగడం మరిచిపోయేను. చెప్పు మాలవాడిదేనా?"

"సందేహం ఏమిటి! వాడికి వెంకయ్యగారు ఇచ్చినమాటకూడా నిజమే."

"అయితే ఒకచెప్పే దొరికిందికదా. రెండోదానిమాట?"

"వాడు ఆరాత్రి నేను రావడం చూచి చెప్పులతో పరుగెట్టడం కష్టమని చెప్పులు తట్టలో వేసుకొని తట్ట పట్టుకొని పరుగెత్తినాడు. చీకటిలో రెండు చెప్పులూ తట్టలో పడవేశి నట్లనుకున్నాడు. కాని ఒకటి అక్కడ మరిచిపోయేడు." తరవాత నామేనమామ తోటకు వెళ్లిపోయినాడు.

నేనుఒళ్ళోకూచున్న మరదలినినిలుచోబెట్టి అన్నాను. "మరదలూ యంత్రం ఎత్తుకుపోతే మీనాన్న అపహరించిన వాడిని పట్టుకొని శిక్షించినాడుట నేను నిన్నుగానే యీవేళ ఎత్తుకుపోయి మావూరు తీసుకుపోతే మళ్ళీపట్టుకోగలడా?"

"ఏమిటీ?" అన్నది నామరదలు.

"నిన్నుగానే నేను ఎత్తుకుపోతే మీనాన్న" అంటూండగానే నామరదలు నన్నొక చెంపకాయ కొట్టి "ఏమో నాకు తెలియదు!" అని పారిపోయింది. పెంకెపిల్ల!

# ప్రణయాగ్ని

"మారుతి, బి. ఎ."

## ౧ సంకల్పము.

క్రొవెలుఁగు వెన్నెలలఁ గుమ్మరించుచుండ
మిన్కుమని నింగిఁ జుక్కలు మెఱయుచుండ

తోఁటలో వేదికను జేరి గాటమైన
తమిని నాప్రాణ నాథునిఁ దలఁచి తలఁచి
చెక్కిటను చేయి చేరిచి దిక్కుగమిని
చూచుచుంటిని.

ఇంతలో సొంపు లొలుకు
చిరునగవుతోడ, వెన్నాడు సిగ్గుతోడ
సొగసులీను వాఁడి చూపుతోడ
మేల్మిబంగారు పురుడించు మేనితోడ
ముందునకు మందగతివచ్చు పొలుపు చూపి
దివ్యసుందరుఁ డొక్కఁడు తేజరిల్లె.

'నా మనోహరుఁ డితఁడే, నా యనుంగు
నెటుకాఁ డితఁడే, నాదు సాటి లేని
పెన్నిధి యితండె, తులలేని సన్నుతాంగుఁ
డితఁడే!' యనిచూచితి.

ఇంతలోన
పులకరించెను గాత్రి, ముప్పొంగె మనసు
కనులు మిరుమిట్లు గొల్పెను! కాంతు తేజ
వారిధిని మున్గి మూర్ఛచే వాలిపోతి!

## ౨ మిథ్యాసౌఖ్యము.

చేతిలో చేయి చేరిచి చెక్కిలి పయి
చెక్కిలి నిడి ప్రణయమంత్ర మొక్కరీతి

బోధచేసెను నాథుఁడు; బోధలెల్ల
మనసునకు నెక్కకుండెను; మాటలాడ
నేరనైతిని; చూపుల నేలవైపు
బరపి నాథుని పాదాల వద్దఁజేర్చి
ప్రణయ సాగరమందున పట్టు వడితి
తేలితిని మున్గితిని గాని తెలియలేదు.

చుబుకమును చేతితోఁబట్టి, "సుందరంబు
నీదుముఖ"మని నాథుడు నేర్పుతోడ
మొగము నెత్తెను; నాథుని మొగము చూచి
కనులు మిరుమిట్లు గొనుటచే కనులు మూసి
నాథునానన మొకసారి నాదునెడఁదఁ
దలఁచి సంతోషమందితి, తనివిఁగంటి
నాథుఁ డంతనె నను నక్కునం గదించి
మోముపై మోముజేరిచి ముద్దువెట్టె.

3 ఆశాభంగము.

కనులు తెరచితి నాథుఁడు కానరాఁడు
చల్లగా వెల్గుచుండె నిశాధవుండు
తోటలో వేదిఁగూర్చుండి దుఃఖవశత
బిక్కవోయితి; నంతట దిక్కులెల్లఁ
గలయ జూచితి—నాథుఁడు కానరాఁడు!
ప్రణయకాలాగ్ని దేహాన బర్వి నన్ను
భస్మమొనరించునో యను భయము తోఁచె.

చల్లగా వెన్నెలలు చిలుక చందమామ
ఆర్పగలఁడొకో నా విరహాగ్ని శిఖలు?
మందగతిఁ జెంది వీతెంచు మారుతుండు
ఆర్పగలఁడొకో నా విరహాగ్ని శిఖలు?
నాథ! నా నాథ! మన్మనోనాథ! రమ్ము!

# 'రసాలము' నుండి

నోరి నరసింహం

రూపమాత్రపు పూలెన్నొ రూపుమాసి
పోయిననె కాని పిందెపూల్ పుట్టబోవు
పిందెలెన్నియొ నాశంబు నొందికాని
పూర్ణఫల మొండు నిలువగాబోదు లతను.

వాతవశమున జిందరవందరగుచు
అభ్రశకలమ్ములు తొలంగి నంతమీద
నమృతధారలు చిల్కు మేఘములు నిలుచు.

బలిమి సేనాముఖంబున నిలుచుభటులు
వీరనాకంబు నొందిన వెనుకగాక
సంగరమ్మున సంపూర్ణజయము లేదు.

# ఒకనాడు

నోరి నరసింహం

పచ్చని బయళ్ళ నడుమగా బయలువెడలి,
తాళవనములు వేనవేల్ దాటిదాటి,
వర్ణితాంబులఁ బ్రతిబింబ పటముఁ గనుచు,
వివిధ జలపుష్పసౌందర్య విధముఁ గనుచు,
జలధర విచిత్రచేష్టల సంతసిలుచు,
అస్తగత సూర్యకాంతి కాహ్లాద మొంది,
దీర్ఘమార్గ శ్రమమ్మును దెలియనైతి!



# స్వేచ్ఛ

చింతా శంకర దీక్షితులు, బి. ఏ., ఎల్., టీ.

విశాఖపట్టణమున స్వగృహము విశ్వనాథము జేరిన నాలుగు నెలల కొకనాడతనితో క్రొత్తకొండడు చాలవఱకెందును గుఱించియో వాదించుచునే ఉండెను.

"నాకుకుడిభుజమువంటివాడు నాకన్న గుణసంపన్నుడు బుద్ధికుశలుడు లోకులదుష్టతచే నాకన్న ఎక్కువగ బాధపడినవాడు. అట్టివానిని వదలి నేను స్వేచ్ఛగా వర్తిల్లుట నాకు పంచప్రాణములును లేనట్లే ఉన్నది. ఆతడు స్వేచ్ఛావిహారియై లేకున్నచో నా కన్నపానములు సహించవు. అంతవఱకు నేను తినునది అన్నముకాదు. త్రాగునది నీరము కాదు." అని ఆతడు తన అభిప్రాయమునంతయు విశదీకరించెను. దాసాతని వాక్యములయందలి సత్యమును బరిశీలించి, విశ్వనాథమున కుత్సాహము కలిగించుటకై,

"బావా, ఆతడు స్వేచ్ఛగా తిరుగుచుండినచో మన కప్పుడప్పుడు కొంచెము పని కలుగుచుండును. పాపము మన కొండడి మనస్సునకది అంతకష్టముగా నున్నప్పుడు కొంచెము "ఊ" అనరాదా? నీ సొమ్మేమి పోవును?" అని ఏమేమో చాలవఱకు ప్రసంగించెను. తుదకు ప్రాణము విసిగి, ఆతడు

• "బావా? దానికి మన మేమి చేయగలమోయి? ఆవిషయము నాతో ఎందుకు మీరిద్దఱు చెప్పెదరు. నేనేమి ఆవిషయమున గలుగుగ జేసికొన దలచుకొనలేదు. నీ కుత్సాహ ముంటే నీవు కొండడికి సహాయము చేయుము. కొండ డావిషయమున స్వయముగా పని చేయగలడు. ఏమి కొండా! చేయు లేవా? చేయలే కేమిలే? నీకు దాసు కూడ సహాయముచేస్తాడు! కాని నేనొక షరతు పెట్టుచున్నాను ఆతడు స్వేచ్ఛ సంపాదించిన తర్వాత నీ వాతనితో నేవిధమైన జోక్యమును గలిగించుకొని యుండరాదు. నీవు నీపూర్వపుజీవనమును సంపూర్ణముగా వదలుకొనెద నని కదా, వాగ్దత్తము చేసినావు? ఈషరతు కొప్పుకొనినయెడల, నీవు నీకిష్టమగు మార్గమున వానికి స్వేచ్ఛ కలిగింపవచ్చును. ఇంకొకటి! ఇట్లు నీవాతని కుపకారము చేయుట ఈయొక్కసారిమాత్రమే అని జ్ఞాపక ముంచుకొనుము పదేపదే, ఆతడు కారాగారమున కేగినప్పుడెల్ల నీవిల్లు బయలుదేరినచో నావాగ్దత్తమునకు భంగముకలుగదా?" అని చాలవఱకు వానికి విషయములనెల్ల నచ్చజెప్పెను. దాసు కూడా ఈపద్ధతి కామోదించెను.

"బాబూ! వాడిసంగతి మీకింకను పూర్ణముగా తెలియదు. నలుగురితోపాటు

అత యుండుటచే మీరాకు చేతజిక్కినాను కాని, ఒకసారి నేనాతనికి స్వేచ్ఛకల్పించినచో ఎంతప్రయత్నించినను తిరిగి మీకే వాడు లభించుట దుర్లభము, నే నిట్లన్నానని మీకు కోపము వద్దు. నా డిసంగతి బాగుగా నెఱింగినవాడ నగుటచే, ఇట్లు చెప్పుచున్నాను. మీ అనుజ్ఞ అయినది కనుక, నేను రెండు మూడుదినములలో బయలుదేరి పోయెదను. దాసుబాబుగారు నాతో వచ్చినచో, పరమ సంతోషము కాని వారు వత్తురా?"

"పదవోయి. నీజోటి వానితో తిరిగితే, లోకము కాస్త బోధపడుతుంది [illegible] వ్యవహార మెట్లా కొనసాగిస్తావో. చూస్తాను?" అనిదాసనెను. కొండడికి తన సహచరుని యందున్న ఈ అభిమాన గౌరవములకు విశ్వనాథమును దాసునుగూడ చాల సంతోషించుటయే, వారు అతనికి ప్రస్తుతోద్యోగము న తోడ్పడుటకు గారణము. కాని బయలుదేరు సమయమున కొండడు ఏదియో అనుమానించుచుండుట చూచి, విశ్వనాథము దాసునకు గనుసంజ్ఞ జేయుటచే, దాసాతని నీవలకు దీసికొనివచ్చెను.

"నీసంగతి చూస్తే ఏదో అనుమానించుచున్నట్లున్నది. ఏమిటది? ఉన్న సంగతేమిటో మనస్సులో దాచుకోకుండా చెప్పు ఫరవాలేదు." అని దాసాతనికి బ్రోత్సాహ మొసంగెను.

"ఏమీలేదు. మనము వెళ్ళేపనికి డబ్బు కొంచె మవసరము. అడిగితే బాబు ఏమనుకొంటారో అని ఆలోచించుచున్నాను. రెండుచేతుల నిండ సర్వకాల సర్వావస్థలయందును డబ్బుండే వాని కీనాటికీ యవస్థ వచ్చెనాఅని విచారించుచున్నాను?"

"అదేమిటోయి అట్లా అంటావు? ఏమీభయములేదు నీకు డబ్బు కేమీ కొదువలేదు. నీచిత్తము వచ్చినంత తీసికొమ్ము" అనుచునుండగను విశ్వనాథము నెద్దకు జేరుకొనెను. దాసు చిరునగవుతో కొండడి అనుమానమును విశ్వనాథమున కెఱింగించెను.

"ఎందుకోయి నీకనుమానము? అన్ని విధముల నేను సహాయము చేయక పోతే నే నీపని కసలు నీకు అనుజ్ఞ ఇవ్వకయే పోదును! నీకెంతకావలెను తీసికో మరల నీకు కావలసిన యెడల, దాసుతో చెప్పితే నాకుత్తరము వ్రాస్తాను. నేను పంపిస్తాను. నిశ్చింతగా వెళ్ళు. ఇంకో సంగతి. నీకు దాసుకుకూడ పని అంత దుర్ఘటముగా కనబడితే నాకు తెలియ జేయండి. వీలు మాచికొనివచ్చి చూచిపెడతాను."

ఆరాత్రి రైలునకు దాసును, మారు వేషముతోనున్న కొండడిని స్టేషను వరకు సాగనంపి తిరిగి యింటికి బోవుచు "తిరిగి, రోటిలో తలదూర్చవలసి వస్తుందేమో?" అని విశ్వనాథమూహించెను.

విశాఖపట్టణమునుండి బయిలుదేరి వచ్చిననాల్గవ దినమున దాసువిశ్వనాథమొసగిన ఉత్తరముయొక్క బలిమిచేనెై

లున్న ఊరిలో సబిన్స్పెక్టరు లలోనొక డైన రాఘవేంద్రరావునుజూడబోయెను.

"జైలు చూడడమునకు నాజోక్య మెంతమాత్రి మవసరమేలేదండి? సాధారణముగా నెవరుచూడవలెనని కోరినను, దరఖాస్తుపెట్టుకొంటే చూడనిస్తారు. సరేలెండి ఈవేళ దరఖాస్తు ఒకటి వ్రాసినాకీయండి రేపుచూచెదరుకాని"

"అదికాదండి ఎఱిగినవారెవరయిన కూడనున్న యెడల, ఆసంగతి ఈసంగతి కొంచెము చెప్పెదరని ఆశ, అందుచే మీరుకూడ దయచేయవలయునని నా ప్రార్థన, మీరే అభ్యంతరముపెట్టవద్దు. నాకీగ్రామము క్రొత్తగదా?"

"సరే, అట్లాగే కానీయండి."

ఆమరునాడుసాయంకాలము మూడున్నర గంటలకు, రాఘవేంద్రరావును, నారాయణదాసును బయలుదేరి, జైలు చూచుటకు బోయిరి. జైలుసూపరింటెండెంటు, వారిని సగౌరవముగా నాదరించి లోనికంపెను. రాఘవేంద్రరావు దాసునకు ప్రతిగదిని జూపించెను. అగ్గిరాముడు గుంపులోనివారున్న తావునకు వారరుదెంచునప్పటికి సుమారైదుగంటలాయెను. అందులోనున్న వారినందఱను జూపి, రాఘవేంద్రరావు దొంగరాముడున్న గదికెదురుగానిల్చి,

"ఈ జట్టందఱిలోను, ఈదొంగరాముడు దేవాంతకుడండి! మీవిశ్వనాథముగారి దయఉండబట్టి మాకువారందఱును వశమైనారు. కాని, మాదురదృష్టమేమోకాని, దొరికిననాడే అగ్గిరాముడదృశ్యమై పోయినాడట్టండి. మీకాసంగతి తెలిసేఉంటుంది."

"ఆ అగ్గిరాముడేమైనాడో ఏమైనా తెలిసినదాండి?" అని నారాయణదాసు కొంచెతనమునకై అడిగెను.

"వాడుపారిపోయినతర్వాత వానికై కనిష్టేబులన్ని దిక్కులకుపోయి చాలప్రయత్నించిరి కాని, వాడుదొరకలేదు. రెండుమూడు మాసములక్రిందట తిండిలేక అటువంటివాడే ఒకడు గోకారము ప్రాంతములయందు చచ్చిపడియున్నాడని తెలిసి, మేమందఱము పోయి చూచి యిచ్చటకు దెచ్చితిమి. సుబ్బారావుగారుకూడ, ఆతడగ్గిరాముడే అని ఒప్పుకొనిరి అంతటితో మాకాబాధ తీరినది!."

ఇట్లేమో కొంతకాల ముపన్యసించి, రాఘవేంద్రరావు మరలెను. వీలుజూచి దాసు దొంగరామునకు ప్రోత్సాహకరమగు నొకసంజ్ఞజేసి, ఆతనిమొగమున నంకురించిన చిరునగవుచే సంతృప్తి గలిగినవాడై జైలునుండి బయలుదేరెను. దొంగరాముడు దేవాంతకుఁడని, జైలు వారందఱు భయపడుచుండిరే కాని, ఆతని నడవడి, అట్టి అనుమానమునకైనను దావొసంగకుండెను. ఉన్నఖయిదీలందఱిలోను, అందుముఖ్యముగ అగ్గిరాముని జట్టివారిలో అతిజాగరూకతతో కాపాడబడవలెనని అధికారులవలన సన్మానపత్రిక పొందిన దొంగరాముడా జైలునుజేరిన మూడునెలలో దుడుకుతనము లేనివాడనియు, చెప్పి

పనివినయవిధేయతలతోఁ జెప్పినవెంటనే
చేయువాఁడనియు, అనుభవించవలసిన
ఆరేండ్లకఠినవఱకము నెట్లయిన ననుభ
వింపక తీరదను దృఢవిశ్వాసముగల
వాఁడును వలె నగుపడుచుండెను. అతి
నిని జూచినచో జైలులోఁ బనిజేయు వా
ర్డర్లు, కావలివారును తుదకు జైలు
సూపరింటెండెంటును గూడ అగ్గిరాముని
జట్టులోఁ జేరినవాఁడని భయమును,
"దొంగ" అను పౌరుషనామమును గలి
గియుండిన దొంగరాముఁడనుటచే ఎవ్వ
రు సంపూర్ణముగా నెఱుంగని అతని
అద్భుతచర్యలకు నాశ్చర్యమును, ఆరేం
డ్లుకఠినవఱకము ననుభవింప వలసిన
ఖయిదీ అని దయాదాక్షిణ్యములతోఁ
మిశ్రితమగు కార్కశ్యమును గలిగి ఉం
డిరి. అంతియేకాక వారెవరైన నాతని
తోఁ మాటలాడ నేతెంచినప్పుడు అతఁడు
చదువుకొనినవానివలె సలుపు ప్రసంగ
మును తనపూర్వచరిత్రమందలి అంశ
ముల నెవ్వరడిగినను, "ఏమున్నది," నితన
గుట్టునావంతయు వెలిబుచ్చని గాంభీర్య
తను జూచి వానియందందఱకు సదభిప్రా
యముద్భవించుట ఒకవింతకాదు. అం
తియేకాక జైలులోఁ ఖయిదీలచే చేయిం
చు ప్రతిపనియందు నాతఁడారి తేరిన వాని
వలెప్రవర్తించి సలుపుచుండుటచేఖయి
దీలపై నాతఁడప్పుడప్పుడు పెత్తనదా
రుగ నియోజింపబడుచుండెడి వాఁడు.
దొంగరామునకు దెలిసినట్లు బట్టలనేత
మామూలుగా సాలివానికైనను దెలి
యదట! తాపీపని, అతఁడు చిన్నతన
మునుండియు నలవాటుపడినవానివలె
నే చేయునట! అతనివంట, నలపాకమని
ఖయిదీలాతఁ డెప్పుడు వంట చేయునా
అని ఎదురు చూచుచుండురట! వడ్ర
ఁపుపనియందాతని నిపుణతనుఁజూచి, ప్ర
సిద్ధికెక్కిన వడ్రంగులు సైతము అచ్చె
రువొందుచుందురట! వ్యవసాయపువి
షయము లాతఁ డెఱిగినట్లు కర్షకుఁడు నె
ఱుగఁడట! ఇకనాతనివ్రాఁత ముత్యాల
కోవ అని జైలంతట ప్రతీతియట! అం
దుచే దొంగరాముని జీవనము, ఖయి
దీజీవనమువలె భరింప నశక్యముగా లే
కుండెనన్న సత్యమునకు దూరముకా
దు. ఖయిదున కలవాటుపడిన వాఁడొక
సారి విడుదలయై జైలునకు తిరిగిపోవు
నప్పుడ త్తవారియింటికేఁగుచున్నానని,
మురియుచు, తోడివారితోఁ జెప్పి ఎట్లు
చింతబొందఁడో స్వేచ్ఛావిహారియై, జై
లులో నిదియే మొదటిసారి నిర్బంధింప
బడిన దొంగరాము డచ్చటివారికి తన
పట్లనున్న గౌరవప్రవర్తనలన, నిజము
గా న త్తవారియింటనే ఉన్నట్లూహింప
వచ్చును.

3

నాలుగుదినములేగిన వెనుక నారాయ
ణదాసొకసారి రాఘవేంద్రరావును జూ
చుటకై వానియింటికేగెను. ఆయూరు
జేరినదాది దాసును, కొండడును జేసిన
ప్రయత్నములకు మితిలేదు. కాని ఒక్క
టియు గొనసాగలేదు. ఇక నొక రెండు

మూడు దినములుచూచి తమకుసాధ్యము కాకుండినచో వారావిషయమున విశ్వనాథము సహాయము నపేక్షింప నుద్యుక్తులయి ఉండిరి. రాఘవేంద్రరా వింటలేదు. ఇంటకనుగొనగా నాటిమ ధ్యాహ్నము మూడున్నర గంటలకెవరో ఖయిదీ జైలునుండి పారిపోయినట్లును, వానిని వెదకి పట్టుకొని జైలు చేర్చుటకు రాఘవేంద్రరావును మఱికొందఱు సబిన్సిపెక్టర్లును, జవానులు బయలుదేరిరనియు, ఇంటివద్దనున్న జవాను వర్తమానము జెప్పెను.

దాసు వార్తనువిని జైలుసమీపము కేగి ఇరుగుపొరుగున నున్నవారివలన నచ్చుటవృత్తాంతమును గొంచెము కొంచెముగా వినెనుకాని, అవి సర్వము న్ను గట్టుకథలవలె నుండెనుకాని, అందొక్కటియు నమ్మదగిన అంశమున్నట్లాతనికి గోచరింపలేదు. దొంగపేరును సరిగా తెలియలేదు. చీకటిపడెను ఇకనచ్చటనిల్చిన లాభములేదని యెంచి, తిరిగి వచ్చినతర్వాత రాఘవేంద్రరావును గలిసికొని మాటలాడిన సర్వమును దెలియగలదని దృఢపరచుకొని, ఆతడింటికిమరలెను. ఊరుబజారున జేరుసరికి రాఘవేంద్రరావుగారు బైసికిలుపైహడావుడిగ వచ్చుచుండుటచూచి, వానికిసలాము జేసి వానినాపెను.

"రాఘవేంద్రరావుగారు! చాలహడావుడిగా నున్నారు. సాయంకాలము మీ ఇంటికి వచ్చినాను. దర్శనముకాలేదు."

"దర్శనములాగే ఉన్నదండి! మొన్న జైలులో, మీకుచూపించినఅగ్గిరాముడి జట్టులోవాడైన, 'దొంగరాముడు' గాలిదుమారపు హడావుడిలో ఇంటిపైనుండి పరారియైనాడు. ఇంతవరకు జాడ తెలియలేదు. వానిని తిరిగిపట్టుకొనకపోతే మా మానప్రాణాలు దక్కవు. శలవు. రేపు సాయంకాలము దయచేయండి. సంగతంతా విశదముగా తెలియజేస్తాను" అని రాఘవేంద్రరావు అతితొందరగా బైసికిల్ పై నెక్కి పోయెను.

దాసు ఈవృత్తాంతమునంతయు విని పట్టరాని సంతోషముతోను, తిరిగి వీరి పాలబడునేమో అను భయముతోను ఇంటికిజేరెను. కొండడీ వార్తల నెల్ల విని అత్యాశ్చర్యముతో "వాడటువంటివాడేనండి. వాడుస్వేచ్ఛగా తిరుగవలసి ఉంటే ఈబందిఖానాలు అడ్డా" అనెను. "ఇంతా శ్రమపడి మనమింతదూరము నుండి వీనికొఱకువస్తే మన నోట్లో కరక్కాయ కొట్టి దాటుకొనిపోయినాడు, ఎంతసాహసికుడోయి! తిరిగి వీరి చేతులలో పడుతాడంటావా?"

'అదిఉత్తమాటండి! అసలుమీకు వాడు ఆర్యపట్టములో దొరకడమే చాలా గొప్పమాట! దాసుగారు! వానిసంగతి మీకు తెలియదు? ఇక ముందు బాగుగా తెలియజేస్తారులెండి! మనమున్నా లేకపోయినా, వాడెప్పుడో ఒకప్పుడు వీరికి చదువుచెప్పునని నేను అనుకొంటూనేఉన్నాను. మనకూ వారలకూకూడా ఒక్కసారేచెప్పినాడు.

"మనకెందుకు చెప్పినాము? మనమేమి చేసినాము?"

"మనమేమిచేసినామని వాడసమర్థుడని అనుకొని, వాని విడుదలకై మనము వచ్చినామని రోజా మనము జైలువెనుక పాడినపాటలవలన గ్రహించి ఉంటాడు. మనము కలుగజేసికొని పోయెదమేమో అని ఆకీర్తిమనకేల దక్కనీయవలయునని, వాడీతని స్వతంత్రముగా జేయుటకు మనకు బుద్ధిచెప్పుట అవును! మనమీరీతిని గూర్చుంటే ఏమిప్రయోజనము! లెండి! పెందలకడ భోజనము జేస్తే మనముకూడ వానిని వెదకుదము, వాడి మార్గాలు కొన్ని కొన్ని నాకు తెలుసును. మనము జైలువారికన్న కొంచెముదృష్టవంతుల మయితే కావచ్చును, తెల్లవారక ముందు, వానిని కలసికొనలేకపోయినా ఇక నేనే రోడ్డువెంబడినై నాపడి ముష్టి నెత్తికొనుచు జీవించెదను. లెండి." అని ఇరువురును భోజనములను జేసి, జైలు ప్రాంతములకు బయలుదేరిరి. రాత్రి తొమ్మిదిగంటలాయెను. ఊరంతయు నిశ్శబ్దముగానుండెను.

౪

ఆదినమున మధ్యాహ్నము, సుమారు మూడుగంటలకు దొంగరాముకుమతి నలుగురైదుగురు ఖైదీలును, జైలువంట ఇంటిపై పెంకుతిరుగ వేయుచుండిరి. ఇంటికీవలవైపున నలుగురు జవానులును ఆవలవైపున నలుగురు జవానులును తుపాకులతో కాపుకాయుచుండిరి. ఇంటిపైకెక్కి జైలుచుట్టు ప్రక్కలగలియజూచుట దొంగరామునకిదియే మొదటిసారి. ఇట్లా ఖైదీలు ఇంటిపెంకు తిరుగవేయుచుండగా పూర్వదిక్కున కొంచెము మబ్బుపుట్టి క్రమముగా పెద్దదై తుదకు నాలుగైదు నిముషములలో గొప్పగాలి దుమారముగా పరిణమించెను. దానివడిజూచి బయటకావలియున్న జవానులు నిలువలేక, లోని జవానుకు హుషార్ ఇచ్చి ఖైదీలను క్రిందకు దిగుడని ఆజ్ఞ ఇచ్చి, సుమారు మైలు చుట్టుకొలతగలిగిన జైలుప్రాకారమును చుట్టి తిరిగి వచ్చుటకు బయలుదేరిరి. జైలు చుట్టుకొలత మైలు. అందు జవానులు తిరిగి రావలసిన దూరము మూడు ఫర్లాంగులే ఉండెను. మిగిలిన ఐదు ఫర్లాంగులలోను, సుమారు మూడు ఫర్లాంగుల వరకు స్థలమెల్ల దట్టముగా పెరిగిన, ఈత, తుమ్మ, జిల్లేడు మొదలగు దుబ్బులతో నిండి ఉండెను. ఈ దుబ్బులు జైలునుండి ఒక అరమైలు పైవరకు వ్యాపించి ఉండెను. ఆపైన నొక ఎత్తైన గుట్ట ఒకటియు, దాని కావల ౨ ఫర్లాంగులవరకు బయలును. ఆపైన దట్టముగా పెరిగిన రెల్లు దుబ్బులును, ఆపైన నఖండగౌతమీనదియును గలవు. పైనగావలియున్న జవానులు లోనికరుదెంచునప్పటికి ఇంటిపైనున్న ఖైదీలు దిగనారంభించిరి. దొంగరాము డంతకన్న చివరదిగుచుండెను. అతడు

దీర్ఘాలోచనా పరుడైనట్లు కనబడుచుండెను. ఇట్లాతడందఱవెనుకదిగుచు, ఇల్లు విడిచి నిచ్చెనపై కరుదెంచునప్పటి కాతడు తన చొక్కాయి నింటి నడికప్పుపై మరచినట్లు జ్ఞాపకమువచ్చి క్రిందనున్న జవానులతో చొక్కాయి తెచ్చికొని దిగెదనని చెప్పి, తిరిగి యింటినడికప్పు జేరెను, చేరి, తన చొక్కాయను దీసికొని, నిలువుగా నిలువబడి, అమితముగు కడుపునొప్పి వచ్చిన వానివలె "అబ్బా" అని గట్టిగా నరచుచు కడుపును జేతితో పట్టుకొని నడికప్పుపై నావలవైపునకు వ్రాలి క్రిందికి దొరలి పడిపోవునట్లు పడిదొర్లజొచ్చెను. జవానులలో నిద్దఱు కళవళముతో నిల్లు దిరిగి రాబరుగిడిరి. దొంగరాముడట్లు సుమారు గజముమేర ఇంటిపైదొరలి, బారెడు దూరములోనున్న జైలు ప్రాకారపుగోడను, తన చేతులతో బట్టుకొని, చంగున గోడ దాటెను. జవానులరుదెంచునప్పటికి దొంగరాముడింటిపైనగాని క్రిందగాని గనబడలేదు. ఆశ్చర్య భయములతో జవానులు నాలుగైదుసారు లన్నిదిక్కుల గలయజూచి "దొంగరాముడు పారిపోయినాడు! పారిపోయినాడు!" అని ఉచ్చైస్వరముతో నరువజొచ్చిరి. మఱి నలుగురు జవాను లీకేకలనువిని, నిచ్చెన దెచ్చి గోడకువైచి, ఆవల కురికిరి. మిగిలిన ఖైదీలను తిరిగి గదులయందు బంధించి, కొంతమంది జవానులు ప్రాకారము దిరిగి గబగబ వచ్చుచుండిరి. కొందఱీవార్తను, జైలు సూపరింటెండెంటునకు దెలియజేసిరి. కొందఱూరిలోని పోలీసువారి సహాయమును గోరుటకై సూపరింటెండెంటు వలన నాజ్ఞాపింపబడినవారై బయలుదేరిరి. జైలంతయు గగ్గోలుగా నుండెను. గోడపైనుండి క్రిందకురికిన జవానులు అంత ఎత్తైన గోడనుండి దుముకుటచే, గాయములుపడియో, కాలు బెణకియో, నెమ్మదిగా నడచుచు, ఆచుట్టు ప్రక్కల దుబ్బులయందు వెదకజొచ్చిరి.

జాగరూకతతో క్రిందకురికిన దొంగరాముడు, జవానులకు ప్రతిబంధకమైన గాలి దుమారము నావంతయు లక్ష్యము జేయుక, దుబ్బులచాటున లేడివలె పరుగెత్తికొని పోజొచ్చెను. జవానులు క్రింద దుముకునప్పటి కాతడప్పుడే సుమారొక ఫర్లాంగు దూరము పోయెను. ఆతని జాడ గనుగొనునప్పటికి జవానుల కైదు నిముషము లుపట్టెను. అప్పటికైన నయ్యది జవానుల చాకచక్యము వలనగాదు. జైలు గోడకరమైలు దూరములోనున్న గుట్టపై నాతడు నిల్చి వెనుకకుదిరిగి తన్నెవరైన. అనుసరించి వచ్చుచున్నారేమో అని చూచుటచే జవానులతడేగిన మార్గమును గనుగొనగలిగిరి. ఆతడింతలోనే ఆగుట్టను తూర్పువైపునకు దిగి అచ్చటగలతోట ప్రవేశించినట్లు జవానులకు గాన్పించెను కాని, ఆతడతివడిగా పదిబారలుపోయి, తిరిగి తోట దాటి గుట్టచాలున నడచి తిరిగి దుబ్బు

లనిదివరకు దాను వెలువడిన స్థలమున గరఫర్లాంగుదూరమున ప్రవేశించెను. ఆతడట్లు ప్రవేశించి దిక్కులతి జాగరూకతతో బరీక్షించుచు జవానులు గుట్టను జేరునప్పటికి తానిదివఱకు గోడదుమికిన స్థలమునకు ఫర్లాంగుదూరమున దట్టముగా పెరిగిన రేగిమొక్కలను గనబడనీకుండునట్లు బెఱిగిన తీగెలపొదలో లేడివలెదాగి కూర్చుండెను. గోడపైనున్న జవానులా దొంగరాముడు గుట్టపై గనుపించినట్లును వానివెంబడి నానలుగురు జవానులు బయిలుదేరినట్లును వర్తమానమును లోనివారికెఱింగించిరి. అంతట "ఘనఘన" మని పెద్దగంట జైలులో ప్రయోగింపబడెను. అది ఖయిదీపారిపోయినట్లు గుర్తు. ఇంతలో నూరిలోనుండి గుఱ్ఱములపై నరుదెంచిన సబిన్స్పెక్టర్లును, బైసికిళ్ళపై నరుదెంచిన సబిన్స్పెక్టర్లును, కత్తులతోను, కఱ్ఱలతోను, తుపాకులతోను చనుదెంచిన పోలీసుజవానులును, వాని వెనుక దా డారంభించిరి. మధ్యమధ్య వారి దృక్పథమునకు గాలిమమూరము కొంతవఱకును, వానకొంతవఱకును ప్రతిబంధకమాయెను. చివర కారుగంటల కాకసము తెరపిగానుండెను. కానిదొంగరాముని జాడ వారుకనుగొనలేక తోటలన్నియు దిరిగి తిరిగి, మార్గస్థులనడుగుచు, అడిగిరికదా ఏదైనచెప్పకున్న మర్యాదకాదని ఏదోచెప్పుచున్న మార్గస్థులను నమ్మి మఱికొంత దూరము పోవుచు చివరకు విసిగివేసారి దిక్కునకు నలుగురు జవానులచొప్పున పోయి వానిని వెదకి, బంధించి, తీసికొనిరావలసినదని ఆజ్ఞాపించి సబిన్స్పెక్టరు లింటికి మరలిరి. తమకర్మము కాలినదని జవానులు భయాక్రాంత హృదయులై నాలుగు దిక్కులకును బయలుదేరిరి. సబిన్స్పెక్టరులింటికిపోయి తిండితిని తిరిగి అశ్వారూఢులై తూర్పుదిక్కునకే బయలుదేరి పోవలయునని నిశ్చయించుకొనిరి. వారిలో నొక్కడీ వార్తను తమ సూపరింటెండెంటున కెఱింగింపవలయునని పోయెను.

ఇక దొంగరాముడున్న మరుగున నుండి కదలక ఒక్కొక్కప్పు డూపిరిని సైతము బిగపట్టుకొనుచు, తిరిగిస్వేచ్ఛ లభించెను కదాయని, ఆనందించుచు లభించినస్వేచ్ఛ నిల్చునా నిలువదాఅని వెఱగందుచు గూర్చుండెను.

౫

కొండడును, దాసును, జైలుప్రాంతములను జేరిరి. పొదలలోడాగిఉన్న పిట్టలకూతలును, చిన్న చిన్న పురుగుల రొదలును, కీచురాయి కీచును, మధ్యమధ్య జైలువార్డర్ల హుషారునతప్ప నాసమీపములయం దింకొక విధమైన ధ్వనిఏమియును లేదు. ఊరంతయు మాటుమణగి ఉండెను. అడుగులో అడుగిడుకొనుచు శోధకులిర్వురును పొదలను జేరిరి. కొండడు తనఊహాలను పైకివినబడని స్వరముతో దాసునకిట్లు చెప్పుచుండెను. అ

మాటలధ్వని రెండుబారల దూరమున గూడ వినబడకుండెను. "మిగిలిన ఖైదీలవలెకాక వీడు పారిపోయిన స్థలమునకు దూరముగా దాగికొండడు. ఏజిత్తులచేతనైనను వీడు సాధ్యమగునంతవఱకు తిరిగి సమీపమున కేవచ్చి చేరియుండును. ఇక ఊరు మాటుణగినది కావున. వీడు బయలు దేరగలడు. కనుక మనమీ పొదలెచ్చటవఱకు వ్యాపించియున్నవో చూడవలయును. పొదలచివర నెచటనయిన మరుగున దాగియుండినయెడల ఎంతకాలమునకైన అతడురాకతప్పదు. కనుక మనమి ట్లుత్తర దిక్కుగాపోయి అకనబడుచున్న గుట్టచేరుదమురండి." ఇర్వురును గుట్టచేరిరి.

గుట్టచేరినతర్వాత కొండడు, దాసుతోగూడి ఆప్రాంతములనంతయు బరీక్షించిరి. చీకటి వారి అన్వేషణకు సహాయకారియై యుండెను. ఇటుతోటలుండుటవలన బహుశః ఈమార్గమేదో ఒక ఊరునకుబోవును కనుక, దొంగరాముడీదారిని బయలుదేరడు. దక్షిణదిక్కున గ్రామమున్నది కనుక వాడాదారి నసప లేపోడు. ఇక వాడుపోవలసినది ఉత్తరముగాకాని, పడమరగాకాని, అనితేలుచున్నది. అయితే ఈరెండుదిక్కులలో ఎటుబోయినను వానికిఖండగౌతమి అడ్డువచ్చునుకాని, ఉత్తరముగా బయలుదేరినచో కొన్నిగ్రామాదులను జేరి పిదప మన్యముజేగవచ్చును. రెండవవైపునకేగినచో గోదావరి నీదకతప్పదు. వాని సంగతి సెరిగినవాడెవ్వడును వాడుమన్యము జేరునని కలలోనైనా దలంపడు. అయితే వీడు ఈదగలుగునా లేడా? ఆ! జ్ఞాపకమువచ్చినది? వీడు ఈదకపోవటమేమిటి? ఒకనాడు వాడు కోటిపల్లిగోదావరిని కాలుకిందబెట్టకుండ రెండుసారులు తిరిగినాడు సరె. వీడీగోదావరి కష్టపడి, ఆవలిగట్టుజేరుతాడు కనుక వీడు తప్పక పడమట దిక్కుగా బయలుదేరును. కనుక మనము వాడుబయలుదేరు దిక్కున వెలువడుట కెచ్చటవీలగానుండునో చూడవలయును. ఆప్రాంతములయందెచ్చటనైన మరుగున మనముదాగి ఉంటిమా, మనము దొంగరాముని దర్శనముకాగలదు." అని అగ్గిరాముడు మధ్యమధ్య తనఅభిప్రాయమును వ్యక్తపరచుచు పరిశోధించి, పడమటదిక్కుగా దాసుతోగూడ బయలుదేరెను.

"పొదలిచ్చట బాగాదట్టముగా బయలుదేరినవి. బహుశః ఈపాటికతడు వీటి చాటునకు జేరియే ఉంటాడు. అడుగులచప్పుడే మాత్రంకాకూడదు సుమండి! మీఎర్రిపంచె నల్లకోటునాకాలువ మనకిప్పుడే ఉపయోగించాలి. నెమ్మదిగా రండి ఇదిగో ఈపొదలో మనము కూడ దాగి ఉందాము వాడు వస్తేమనకు కనబడకపోడు, ఈతరువుచాటున మణగి కూర్చుందాము" అనియిర్వురును, ఈతరువునానుకొని కూర్చుండిరి. ఒక గజము దూరమున గూడనచ్చట మనుజులున్నట్లులజాడి లేకుండ వారు తమ దుస్తుల సహాయమున, ఇమిడి కూర్చుండిరి. ఇర్వురును కదలిక లేకుండ దిక్కులనటిజాగ

మానమున్నదా?"

"ఇంకేమి అనుమానము లేదు. బాబూ! వాడిని వదాలాలని లేదు కాని, మనము వాడిని దగ్గరపెట్టుకొనుటయు కష్టమే, వాడుండుటయు కష్టమే! గాలిని బంధింపగలమా!"

# అష్టపది

కొమాండూరి కృష్ణమాచార్యులు

[జయదేవ కవీంద్రుని గీతగోవింద కావ్యములోని
'వదసి యది కించి దపి దంతరుచి కౌముదీ'
అను అష్టపది కాంధ్రము]

నీవొకింత వచించిన నీరజాక్షి
దంతరుచికౌముదులు వాపు దరతిమిరము
అధరసీధువు నిచ్చి నీయాస్యవిధుడు
భూరిముదమిచ్చు నేత్రచకోరములకు
చాలు ననిదానమానంబు చారుశీల!

మదనధూర్తుండుదహియించె మానసంబు
ఆస్యకమలామృతంబు నాకతివ, యిమ్మ
కోపముండిన నాపయి గువలయాక్షి
ఖరనఖరఘాత మొసగు నీకసికొలది
తెరవ, భుజపంజరమున బంధింపు నన్ను
నొసగు రదఖండనం బది పొసగదేని
ఇచ్చవచ్చిన యటు లలయించు నన్ను
చాలు ననిదానమానంబు చారుశీల!

నీవ నాభూషణంబవు నీలవేణి
నీవ నాజీవనంబవు నీరజాక్షి
నాదు సంసారజలధిరత్నంబ వీవ
అతివ, వేడెద నీకటాక్షాంచలంబు
నీకృపారసలేశంబు నాకొసంగు
చాలు ననిదానమానంబు చారుశీల!

నీలనలినాభమైన నీనేత్రియుగ్మ
మతివ, రక్తోత్పలమురీతి నరుణమయ్యె
అసమశర బాణభావంబు ననుకరించి
కృష్ణు రజింపఁజేసె దోకీరవాణి
చాలు ననిదానమానంబు చారుశీల !

నీదు కుచకుంభములమీఁద నెగముమాణులు
సుదతి, రజింపఁజేసె నీహృదయసీమ
ఘనజఘన మండలంబుపై ఘంటికలును
మదనిసందేశ మతివరో, మొరలువెట్టె
చాలు ననిదానమానంబు చారుశీల !

స్థలకమల గంజనంబుయి చతురవాణి
హృదయ రంజకమైన నీపదయుగళికి
అరుణలాక్షారసంబిత్తు నాజ్ఞయేని
అతివ, రతిరంగపరభాగ మదియొసంగు
చాలు ననిదానమానంబు చారుశీల !

స్మరగరళఖండనము శిరోమండనంబు
నైన నీపదపల్లవంబతివ! నాదు
శిరముపైనుంచు; మడఁచును గరముఘోర
దారుణారుణ తాపంబు తాళఁజాల
చాలు ననిదానమానంబు చారుశీల !

అనుచుఁ బటుచాటు చాటువాక్యముల రాధ
ననునయించెడి కృష్ణు వాగమృతధార
కామినీ మానసోల్లాస కారణంబు
మధుర జయదేవ భారతీమండితంబు
విజయమొందెడుఁగాత యీవిశ్వమందు !

# వసంతోదయము

కొణిదెన బాలకృష్ణయ్య

వలరాజు చెలికాఁడు వనములఱేఁడు
మన పాలి భాగ్యంబు మనకల్పకంబు
మనల నొక్కటి గాఁగ మన్నించువాఁడు
చాల కాలమునకుఁ జనుదెంచినాఁడు
వన్నె వన్నెల చెలువంబులు మించ
సింగారములను సైసేసి యందముగ
లతకూనలార! అల్లన సాగివచ్చి
మన వసంతునకు నమస్కారమనరె!
స్వామి కందఱు చేరి స్వాగతం బిడరె!

మొలక నవ్వులు గుల్కు మురిపెంబు
లొలుక
ముద్దులమల్లికా ముందు రావమ్మ!
గమగమ తావులు గ్రమ్మ కోనంగ
చలము సేయక రావె జాజినెలఁత!
గరువంబు చూపక కదలి రావమ్మ
వాసంతికా, కమ్మవాసనల్ దనర.
సొగసు చూపుల నట్లు చూచెద వేమి
యేలా మతల్లి, జాగింకేల నమ్మ!
పువ్వుల దొరసాని పొలతి గులాబి
కెంజాయ చెక్కులఁ గేలు కొనంగఁ
గోపగింపక రమ్మ కొమ్మలఁ గూడి
రావె యో గిరిమల్లె రావె గోరింట
రావె యో మాలతీ రా కురువింద
ఆలసింపక మీర లమ్మక చెల్ల!
లత కూనలార, అల్లన సాగిరారె
హారతు లెత్తరే యామని దొరకు!

మాధవుం డేతేర మది కోర్కు లూర
మదిరాక్షి వనలక్ష్మి మానిత గతిని
నెఱ నీటు తోడి వన్నెలు పచరించెఁ
గ్రొందలిరుల మావి గున్నలు వొలిచె
అవని జంబులు ముదురాకుల నూడ్చి
చెలువారఁ గ్రొంగొత్త చిగురుల మించె
వడాకులనఁటుల నెసఁగెఁ గప్పురము
అలరులఁ దిని పికం బానందమునను
బంచమ స్వరమునఁ బాడఁ దొడంగె
బాటసారులు చెమ బడలిక ల్వాయ
మలయానిలము వీఁచె మందమందముగ
వింత యలంకార విభవంబు కలిమి
బ్రహ్మాండమున కిది పండువ యయ్యె
లతకూనలార, మెల్లనఁ బైకి సాగి
అలమాధవునకు జోహారు లీరమ్మ!
మన సౌకుమార్యంబు మనసోయగంబు
మన వన్నెచిన్నెలు మనసుగంధంబు
వసుధలోఁ గలవె యెవ్వారికి నైన?
పొందుగా నీశ్వరుఁ బూజింప మనము
రాజుల మకుటముల్ రంజింప మనము
గొప్పవారల నెదుర్కొనుటకు మనము
తమకంబుతోడ నూతన వధూవరులు
అలంతి నవ్వుల బాతు లాడంగ మనము
అతను తాపంబున నలసటఁ జెందు
చిగురుఁబోణి కమర్చు సెజ్జకు మనము
శృంగారవతులకు శయ్యా గృహాల
సరససౌరభము ప్రసాదింప మనము

## ఆత్మసామ్రాజ్యము

పొలయల్లుఁ జెందిన పూబోణి ధవుని
దండింపఁ దగు నాయుధములకు మనము
అందంబులగు వింత యందము లిచ్చి
జనరాక్షసముద్భటులను దీర్ప
సహాయకులము నుండి జనుల కెల్లరకు
ఘనశక్తి నెఱుఁగఁగ మసలుచున్నాము!
కమ్మని తావులు కడలెల్ల మునుఁగఁ
దగ రజచ్ఛటలు ...దసి నాసికను

రకరకంబులఁ బొల్చు లావణ్యములను
బూచిత హృదయముల్ దూర పోవంగ
గనుఁగొన్న వారెల్లఁ గైదండ లిచ్చి
మనల మార్గము చేరి మర్యాద సేయ
సుకీర్తి లతికలు మహినెల్లఁ బ్రాక
నైకసాత్త్వికుఁ గొండ నందఱు గూడి
వసంతోత్సవ వైభవంబునను
స్వేచ్ఛగా స్వామిని సేవింపరమ్మ!

## ఆత్మసామ్రాజ్యము

బుదా సూర్యనారాయణ, బి. ఏ., ఎల్. టీ.

పరుసంబు సోకినఁ బరుసమౌ లోహంబు
మిసిమి బంగారమై మెఱయునట్లు
భ్రమరసాంగత్య సంభ్రమముకేఁ గీటకము దా
భ్రమరరూపము దాల్చి పరఁగునట్లు
శుక్తికా ప్రాప్తిచే శుద్ధవార్బిందువుల్
విమల ముత్యంబులై వెలయునట్లు
భవ్య దివ్యామృతాస్వాదనంబునఁ దేహి
యమరత్వమును గాంచి యలరునట్లు
మహిత మాయానిజజ్ఞాన మర్మవేదు
లైన విజ్ఞానవర్యుల యాదరమున
విస్తృతములైన యారోగ్యోక్త విధుల నెఱపి
యాత్మసామ్రాజ్య మందుఁడీ యాంధ్రులార!

అతుల మమలంబు నద్వయం బచ్యుతంబు
నైన పదమున నానంద మాదవలయు
అన్య పదముల నానంద మమరు ననుట
యెండమావుల నీరంబు లుండుననుట!

౧౬

# సుగాలీకుటుంబము

ఒక బి. ఏ., ఎల్. టీ.

ప్రాత అధికారి వెళ్ళి కొత్తఅధికారి వచ్చినా డన్నవార్త చుట్టుపట్ల నున్న గ్రామాల కన్నింటికీ తెలిసింది. ఇంత త్వరలో తెలియడానికి కారణము లేక పోలేదు.

ఆప్రాంతపు దేశమంతా అడవిమయము. ఆఅడవిలో ఒకభాగమునకు ఈయన అధికారి. ఏవూరివాడో తెలియదు. అధికారము చెలాయించేటప్పుడు ముక్కుకు సూటిగా వెళ్ళడం ఈయభిమతము. ఈసంగతి ఈయనే పలుపురతో చెప్పటం కద్దు. లోకులు ఈ సన్మార్గమును కాఠిన్య మన్నారు

ఒకనాటిసాయంకాలము ఈయన— పాత్రకు పేరు వుండవలెను, గనుక ఈయనను మునిస్వామి అందాము— కంసాలివానికి వర్తమానము చేసినాడు. ముప్పదితులముల బంగారముతో చేయబడినకంఠె ఒకటి ఆయనభార్య పెట్టుకొనే అలంకారములలో ఒకటి. ఈకంఠెను చెరిపించి నలభైతులాల బంగారపుకంఠె చేయించిపెట్టమని భార్య అడగడము కంసాలిని పిలిపించడమునకు కారణము.

కంసాలి వచ్చినాడు. అతనికి చెప్పవలసిన మాటలు చెప్పుతుండగా అడవికాపరులు ఒకమనిషిని పట్టుకొని మునిస్వామివద్దకు తీసుకు వచ్చినారు.

అడవిలో నల్లమద్దికొమ్మ కొట్టియీమనిషి తీసుకొని పోతూండగా కాపరులు పట్టుకొన్నారు.

మునిస్వామి విచారణలో తేలినవిషయ మిది. ఈమనిషి బండిచక్రమునకు కొన్ని ఆకులు విరిగిపోయినవట. కానడాని కెక్కడా కర్రలు దొరకలేదట. బండి తోలుకొని జీవించడమే అతని ప్రధానవృత్తిట. అందుచేత అడవిలో కొమ్మ కొట్టినమాట వాస్తవమట.

సన్మార్గగామియైన మునిస్వామి అతనిపై కేసు చేసినాడు. అడవికేసులకు సాక్ష్యము మొదలైనవి అక్కరలేదు. అధికారిమాటా, మేజిస్ట్రేటుశిక్షా. నేరస్థునికొంప గుండము! అడవిపరిపాలనలో న్యాయచక్రము పైమాటిమీద ఎప్పుడూ వర్తించుచుండును.

ఆమనిషికి రెండుసంవత్సరముల కఠినవరకము పడినది మునుసామి వచ్చిననెలలోపుగా ఇట్టి వెన్నో జరిగినవి. ఆయనకీర్తిచంద్రికలు నాల్గువేపులా వ్యాపించిన వంటే ఆశ్చర్య మేమి!

౨

రాక్షసనామసంవత్సరమున సకాలమున వర్షములు లేకపోవుటచేత కొన్నిచోట్లా, వర్షములు వెనకబట్టుటచేత కొన్నిచోట్లా కాటకము సిద్ధించినది. పచ్చని చేలుండవలసిన తావులందు వర్రభూ

ములు కానవచ్చుచున్నవి. సూర్యుని వేడిమి సోకాటికి సహింపరానిదిగా ఉన్నది. నాగస్ఫె, గొబ్బిలు, జిల్లేడులు, పాపటాకు, మొక్కలు ఆకులు ఎండి మూల కొరిగినవి. నూతులందు నీరు పాతాళానికి లోనికి పోవుచున్నవి. చెరువు లెండుకు పోయినవి, విత్తనములకొరకై వెనకటిసంవత్సరము దాచుకొన్న ధాన్యము, జొన్నలు, కొఱ్ఱలు, ఈసంవత్సరము గ్రాసమునకు వినియోగపడుచున్నవి. భూమిపై గడ్డి మొలవలేదు. అడవిలో చెట్లు చిగుర్చలేదు ఆవులకు మేత లేదు. మనుష్యుల కాపురాలు లేవు.

"ఈయేడు వర్షములు లేక పంటలు లేవు. తినడానికి కాటిపళ్ళైనా పడ డంలే" దని ఒకముసలివాడు విలపించినాడు.

ఈకాలమున మనుసామి అధికారములోనున్న అడవికి సమీపమున ఒక వూరిలో ఒకసుగాలీకుటుంబము కాపురముండెను. ఈకుటుంబము ఆవూరికి రావడమునకు పూర్వము ఎర్రకొండలలో వుండెనట. అక్కడ వున్నచెంచు వాళ్ళు వీళ్ళ కొంపలో పడి దోచుకొనడముచేతనూ, వీళ్ళపశువులను తోలుకు పోవుటచేతనూ జీవనాధారము లేక యిక్కడకు వచ్చినారు. అడవిలో నివసించినచో చెంచువాళ్ళు బాధపెట్టుదురనే భయముచేత వూళ్ళోనే కాపురమున్నారు.

ఈకుటుంబము కడుబీదస్థితిలో వున్నది. భార్య, భర్తా, పదుగురుపిల్లలూను. వీరిపై దయదలచి ఒకబ్రాహ్మణుడు తనదొడ్డిలో వీరి నుండనిచ్చెను. ఆదొడ్డిలో పాకవేసుకొని వీళ్లున్నారు.

సుగాలీవాళ్ళు అడవిజాతికి చేరినవారు. చెంచులు, ఎరుకులు, కోయలు, లంబాడీలు, ఒడ్డలూ ఇట్టిఅడవిజాతులే.

సుగాలీలకు కొండలూ అడవులూ నివాసస్థానము. వీళ్లు అడవులకు పిల్లల వంటివారు. అడవులు వీరిని కనును, అడవులు వీరిని పోషించును. అడవులు వీరిని భరించును. అడవులకు వీరు ప్రేమఅస్థులర్పింతురు.

సుగాలీస్త్రీలు అలంకారప్రియులు. వివాహితయైన సుగాలిస్త్రీ చేతులకు ఎముకలతోచేసిన కంకణములను మోచేతివరకు ధరించును. బొంతలలో చిన్నచిన్న అద్దములను కుట్టి గవ్వలను మాలలుగా కుట్టి బొంతల కతికించి ఆబొంతలను లంగావలె కట్టుకొనును, ఉరస్థలి పైకప్పుకొనును. రంగురంగుల గుడ్డలతో నీబొంతలను చేయుదురు. రంగులన్న వారికి ప్రీతి. వారిబొంతతోనైన టోపీని తలపైధరించుటకూడ కద్దు. సుగాలిస్త్రీలు సొగసుగా నుందురు. ఆరోగ్యము సౌందర్యమునకు వన్నె తెచ్చును. వీరికి ఆరోగ్యము సౌందర్యముకూడా కలవు.

పురుషులునుస్త్రీలునుకలసి పండుగ దినములలో నృత్యముచేసెదరు. సుగాలీ

భాషలో పదములు పాడెదరు.

అడవులలో కట్టెలనుకొట్టి మోపులుగా గట్టి ఊరూరు దిరిగి వాటి నమ్మి జీవింతురు వీరు. ఇది కొందరివృత్తి. కొందరు అడవులలో పశువులను మేపుకొని జీవింతురు.

ఈసుగాలులు ఇతర అడవిజాతుల వలెనే అప్పుడప్పుడు దారులుకాచి దొంగతనము చేయుటకద్దు. అందు స్త్రీలు గూడ పాల్గొందురు. వీరిలో సాధారణముగా స్త్రీలు పురుషులకన్న బలాఢ్యులు.

కాటకము నానాటికి తీవ్రమైపోయింది. మర్యాదగా కూలిపని చేసుకొని గుక్కెడుఅంబలి త్రాగేవాళ్ళందరికీ చిప్ప చేతికి వచ్చింది. ఊళ్ళల్లో యాచకులసమ్మర్దము ఎక్కువఅయిందని పత్రికలలో మొరలు వినిపించెను. వీధులలో పాటలుపాడుకొనుచూ యాచకులు సంచారము చేయుచుండిరి. "వానదేవుడుపదములు" వీళ్లతావుల వినవచ్చుచుండెను.

వానదేవుడా ఓవానదేవుడా
ఇగ యెందు కున్నావు జగమేలునాసామి
చినచిన్న మొలకలు జింకల పాలాయె
వేసినచే లన్ని ఎండెండిపోయె
చుక్కంటి మొగవాళ్లు సూదులైపోయిరి
ఏకంత మొగవాళ్లు ఎధవాడివుండిరి
గుంటిక కొట్టేవాళ్ళ గుండెలారుకుపోయె
నాగలి పట్టేవాళ్ల నడుము లెండుకుపోయె
నెత్తిమీద సూర్యుడా నెలవన్నె కాడా
తలమీద సూర్యుడా దండంబునీకు
ఏనుగం తెద్దులూ ఎత్తుబడి పోతాయి
గాడికట్టిన పసరం గడ్డెంత పోలేదు
ఎక్కడా వున్నావో గిక్కడా కదులయ్యా
కురిపించు నాసామి కుంభవర్షాలు
కురవాక మాతోడ కువ్వారమేల
వానలు కురిపించి ప్రాణాలు రప్పించు
వంకలూ నిండంగ వాగులూ నిండ
కురిపించు నాసామి కుంభవర్షాలు
వానదేవుడా ఓవానదేవుడా
ఇగ యెందుకున్నావు జగమేలు నాసామి

3

ఈ సుగాలీకుటుంబము కూలిపనులున్న రోజులలో కూలిపని చేసుకొని పొట్టపోసుకునేవాళ్ళు. కాటకము వచ్చుట కూలిపనులు పోవుట ఒక్కమారు తటస్థించినది. కట్టెలు కొట్టుకొని అమ్మి జీవిస్తామంటే అడవి స్వాధీనములో లేదు. పశువులను కాచుకుందామంటే పశువులు లేవు. అడవిజాతివాళ్లని అడవిని అనుభవించ నద్దనడం పిల్లను తల్లివద్ద పాలుతాగరా దనడమే.

ఈసుగాలీకుటుంబమున యజమాని పేరు రూపల్‌నాయక్, అతనిభార్య పేరు చంద్రి. వీనికి కొడుకులు కూతుళ్ళు పాలుతాగుపిల్ల మొదలుకుని ౧౫ యేళ్ళవరకు వయస్సువచ్చిన పిల్లలు ఏడుగురు. సూర్యానాయక్, రామునాయక్, పొటేల్‌నాయక్, లక్ష్మి, సీత, బద్రి, భారతి వాళ్ళపేర్లు. తండ్రీతల్లీ పాటుపడి పిల్లలనందరనూ పోషించవలెను. పెద్దపిల్ల లక్ష్మికి వివాహమయినది పండ్రెండవయేట. అత్తవారు తీసుకుపోయి బాధలుపెట్టడంవల్ల అత్తవారింటినుంచి పారిపోయి వచ్చి తల్లి వున్న వూళ్ళోనే ఒకశూద్రకుటుంబములో చాకిరీకి ప్రవేశించి పొట్టపోసు

కుంటూంది లక్ష్మి.

తొలికోడి కుయ్యడంతోనే రూపల్ నాయకుడు చంద్రి బయలుదేరి కొండలమీదికి అడవులలోకి పోతూవుండడం వాడుక, పిల్లలందరూ యింటివద్దనే వుందురు. అడవికిపోయి అక్కడ జేవదారుకూర, పింకికాయలు, పాలపళ్ళు, వెలగపళ్ళు — ఏవిదొరికితే అవి తీసుకువచ్చి ఊరూరా తిరిగి జొన్నలు కొర్రలు పోగుచేసుకొని మధ్యాహ్నం ఒంటిగంటకు ఇంటికి వచ్చే వాడుక. అప్పుడు కొర్రన్నమో, జొన్న సంకటో, జొన్నరొట్టో తయారుచేసి తామింత తిని పిల్లల కింత పెట్టి ఆరోజు గడుపుకునేవాళ్లు.

సుగాలీవాళ్లు కష్టపడి పనిచేసి గంజి తింటారు గాని ఒకరిని దేహి అని చెయ్యిచాపి అడగరు ఇస్తే వద్దనరు.

కొంతకాలం ఈరీతిగా జరిగింది. క్రిజలలో క్షామము ప్రవేశించినది. అడవి కూరలూ పండ్లూ కొనేవాళ్ళసంఖ్య నానాటికీ క్షీణించింది. ఇక చేయవలసిన దేమి? చేయుటకు కూలిపనులు లేవు. కాయుటకు పశువులు లేవు. ఆకుకూరలు కొనుటకు మనుష్యులు లేరు. ఇట్టి స్థితిలో నున్నవారే కొందరు యాచకులౌదురు. ఇట్టిస్థితి నున్నవారే కొందరు దారులుకొట్టుటకు మొదలుపెట్టుదురు. ఎవరి దీతప్పు? వారిదా?

౪

అయిదారుగురు పిల్లలు రోటిచుట్టూ మూగినారు, వారెవరు? మోకాలిపై తలనుంచి ధ్యానము చేయుచు కూర్చున్న ఆ పొడుగాటి ఆమె ఎవరు? వారి ముఖములు వెలవెల పోయి యున్న వేల? వారికన్నులు గుంటలు పడిపోయి నవేల? రోటిని చేతిబూచి ఒక్కరీతిగా చూచుచున్నది. అది యేమి? ఆమె ఎవరు?

ఈతకాయలు ఎక్కడెక్కడ పోగుచేసుకొని వచ్చి వాటి నెండబెట్టి తరువాత వాటిని దంచి గింజలను పారవేసి ఆపిట్టుతో రొట్టెలను కాల్చుకొనుచున్నారు రూపల్ నాయక్ కుటుంబము, మార్గము లేనివారికి భగవంతుడొక మార్గమును కల్పించకమానునా! కాలినది ఈతపిట్టుతో చేసిన రొట్టె ఒకటి తినుటకు సిద్ధముగా నున్నవారు ఎనమండుగురు.

కొంతకాలమిట్లు గడచినది. ఈత పళ్ళుకూడ కొన్నాళ్ళకరుదైనవి. కానా! చెంచువాళ్ళు కోలమూడిగెలు సుగాలీ వాళ్ళు ఇందరికీ ఎంతకాలము ఈత పళ్ళు ఆధారమై వుండగలవు? ఇంక సాధన మేమి?

ఒకనాటి ప్రాతఃకాలమున రూపల్నాయక్ చంద్రి యిద్దరూ తట్టలు చేతితో పట్టుకు పోయినారు. వాళ్ళపిల్లలు ఊరిలో వీళ్ళగడపలూ వాళ్ళగడపలూ పట్టుకొని కాలము బుచ్చుచున్నారు. మధ్యాహ్నమగుసరికి భార్యాభర్తలిద్దరూ తట్టెడుచింతగింజలను తెచ్చినారు. అవి యేల! ఆచింతగింజలనురోటిలో ఇద్దరూ దంచినారు. నీళ్ళల్లో నానవేసి కడిగి

నారు. ఎండబెట్టి తిరుగలిలో విసరి నారు నల్లటిపిండి తయారైనది. వీరు చేయు పనులను పంచప్రాణములు కన్నులు చూస్తూవున్నవి. ఈపిండితో సాయంత్రమునకుసరికి రెండురొట్టెలు తయారైనవి. మెడపట్టులు పట్టుకొనుచూ తమకు తక్కువైనదని కొట్లాడుచూ పిల్లలూ దంపతులూ ఆరొట్టెలను తిన్నారు. ఇంతనీరు త్రాగినారు. ఆదినమునకు భగవంతుడింతయిచ్చినాడు. హాయిగా రాత్రి అందరూ వెన్నెలలో విచారము లేకుండా నిద్రపోయినారు.

కొంతకాల మీరీతిగా జరిగినది. చింతగింజలకుకూడా కరవైనది. కొన్నాళ్ళకు చింతగింజలను వర్తకులు అమ్మ మొదలుపెట్టిరి. పడి అర్థణా! అర్థణా ఆసుగాలీవాళ్ళకు ఎక్కడనుంచి వచ్చును? ఇక చేయున దేమి?

ఒకనాటి సాయంకాలము ఒకసుగాలీకుటుంబము ఆకుబయట ఆకులలో నల్లటిపదార్థము పెట్టుకొని ఆత్రముగా తినుచున్నారు. ఆనల్లటిపదార్థ మేమి? చింతచిగురూ చింతపండూ బూడిదలో కలిపి పొయ్యిమీద ఉడికించగా తయారైనపదార్థము. ఈఅంబలిత్రాగి. కడుపునిండా నీళ్ళుత్రాగి చింతలేక హాయిగా నిద్రపోయిరి. ఇట్లు కొన్నాళ్ళు. అడవిలో చింతపండు తెస్తూవున్న వాళ్ళకు శిక్షపడుతూందని వదంతి పుట్టింది. ఇక చేయవలసిన దేమి?

దేవదారుకూర మిగిలిన ఆకుకూరల వలెగాక కొంతసువాసన కలిగియుండును. దీనిని బ్రాహ్మణులు పప్పులో వేసి వండుకొందురు. ఇదిమెంతికూర పప్పువలె నుండును. అడవులలో తిరిగే వాళ్ళు ఈకూరను వ్యారివారికి బియ్యమునకూ జొన్నలకూ అమ్మెదురు. కొనువారు లేనప్పుడో?

అడవిసమీపమున నున్న దేవదారు చెట్లనాశ్రయించి మధ్యాహ్నమునకుసరికి ఒకతట్టెడు దేవదారుకూర తెచ్చినారు ఆసుగాలిదంపతులు, కుండలో ఆకూరనుబోసి నీళ్లుపోసి ఉడకబెట్టిదించినారు. ఆకులలో పెట్టుకొని పిల్లలూ తల్లీదండ్రీ కడుపునిండా తిన్నారు. హాయిగా నిద్రపోయినారు.

ఈరీతిగా కొన్నాళ్లు జరిగింది. అడవియంచుల నున్నకూర నానాటికి తరిగిపోయినది. ఇక చేయవలసిన దేమి?

నడిరాత్రి బయలుదేరి ఎవ్వరూ చూడకుండా యింత దేవదారుకూర దూసుకొని వచ్చి తెల్లవారుసరికి ఇల్లు చేరి ఆరోజు గడుపుకొన వలసివచ్చింది ఇట్లు కొంతకాలము గడిచినది. ఒకనాడు తోవలో నలుగురు మాలవాళ్ళు కనిపించినారు. రెండురోజులకు ముందు వారు దేవదారుకూర ఆరీతిగా తీసుకుపోవుచుండగా అడవికాపరులు పట్టుకొనిరట. నూతనోద్యోగికడకు తీసుకుపోయిరట. బొటనవ్రేలిముద్రలను వేయించుకొన్నారట. ఈవర్తమానము సుగాలిదంపతులకు తెలియవచ్చినది. ఇక అడవికి పోవుట ఎట్లు? పొట్ట పో

పించుకొను టెట్లు? పిల్లలను పోషించుట ఎట్లు?

రెండురోజులపాటు సుగాలీకుటుంబమునకు తిండిలేదు. చికుకు బావిలోనుంచి తెచ్చుకున్న నీళ్లే తిన్నారు. ఆనీళ్లే త్రాగినారు. వెన్నెలలో సుఖముగా నిద్రపోయినారు రెండురోజులు గడచినవి. ఇట్లెన్నిరోజులు గడచును?

కష్టములనుభవించువానికి భయము తక్కువ. ఏ కొంచెమును భయముండదు. అధికారులన్న భయమా! మృగములన్న భయమా! తోడివారన్న భయమా! ఆప్తులు సంభవించునని భయమా! భయముతో కున్న చేయునది? కష్టములు వచ్చును. ఉన్నకష్టములలో అవి కలసిపోవును. ఇంక భయమెందుకు?

మరింతజాగ్రత్తగా దేవదారుకూర అడవులలోనుంచి వారు తెచ్చుకొనక తప్పినది కాదు. కొంతకాలము సరిగా కే జరిగినది. ఒకనాడు రూపల్ నాయక్ అడవిలో దేవదారుకూర కోయుచుండెను. చంద్రి కొండలలో ఒకచరియలో ఈతచెట్లకు పళ్లున్నవనివిని ఆపళ్లకోసము అక్కడకు వెళ్లినది. రూపల్ నాయకుడు ఒడినిండా కూరకోసుకొని అడవి దాటి వస్తూవున్నాడు. ఇద్దరు అడవికాపరులు అతనిని అడ్డగించినారు. పారిపోయినాడు పరుగెత్తి వానిని పట్టుకొన్నారు. అతనిని పరీక్షించినారు. దేవదారుకూర కానవచ్చినది ముందు స్వామి కడకు తీసుకుపోయినారు. దేవదారుకూర కోసినట్లును కొమ్మలను విరిచినట్లును కేసు కూర కొయ్యడం తప్పు కాదు, కొమ్మలువిరవడం నేరము. కొమ్మలు విరవడం ఎందుకు? పట్టుకుపోయి అమ్ముకుందామనేకదా, అమ్మటానికి సమ్మతము లేకుంటే చేయవలెననే వుద్దేశ్యమే కదా! మేజిస్ట్రేటువద్ద కేసు జరిగింది. రూపల్ నాయకుడు దీనముగా చెప్పుకున్నాడు. తనకు ఏడుగురు పిల్లలని, కూలికిపోయి కోవడము వృత్తని, కూలికనులు లేవని. తిందామంటే ఈతపళ్ళు కరవయినవి. బూడిద తాగుదామంటే చింతకాండ కరవయింది చింతపిక్కలు తిన్నాము. చేతులు వైనవి. దేవదారుకూరపై ఆతనికుటుంబమంతా ఆధారపడియున్నది. అతడు కొమ్మలు విరవలేదట. కూర కోసుకున్నట్లు ఒప్పుకున్నాడు.

మేజిస్ట్రేటు న్యాతవోద్యోగి చాకచక్యమును మెచ్చుకున్నాడు. సుగాలీవానికి నాలుగుసంవత్సరముల ఖయిదు విధించినాడు.

౫

చంద్రి ఈతపళ్లను ఇంటికి తెచ్చునరికి రూపల్ నాయకుడు ఇంటికిగాలేదు. ఎక్కడైనా కూలికి పోయినాడేమో అని సంతోషించింది. ఈతరొట్టెలను పిల్లలకు పెట్టి తాను తిన్నది. రెండుమూడురోజులపాటు రూపల్ నాయకుడు ఇంటికి రాకుండడము అలవాటే.

రెండురోజులు పోయినమీదట తన భర్తకు ఖయిదువేసినారని చంద్రికి తెలిసింది. ఏమి చేయగలదు! తన రెక్కలతో

ఇందరని పోషించగలదా! ఎడపిల్లను పెద్దపిల్లకు అప్పగించి చంటిపిల్లను చంకబెట్టుకొని ఒకనాడు ప్రయాణమై తెల్లగొండలకేసి పోయింది. తెల్లకొండలలో దాని పట్టా లేనట్లుగట. ఈసంగతి ఊరి వారికి తెలియదు.

పాకలో నలుగురుపిల్లలు తల్లిదండ్రులకోసము ఆనాటి మధ్యాహ్నమువరకు వేచియుండిరి. ఎవ్వరూ రాలేదు. పాకను విడిచి ఊరిలో అలుగురూ వేర్వేరు దిక్కులకు పోయిరి. వారేమయిరో ఎక్కడుండిరో ఎవరికీ తెలియదు. భూదేవి వారిని కన్నది. భూదేవి వారిని మరల స్వీకరించినది.

రూపల్ నాయకుడు నాలుగేండ్లు నతర్వాత ఆవూరు వచ్చినాడు. తన కుటుంబము లేదు. భార్య తెల్లకొండలకో ఎక్కడకో పోయిందని పిల్లలెక్కడకో పోయినారని పొరుగువాళ్ళు చెప్పినారు. రూపల్ నాయకుడు ఆరోజునే బయలుదేరి తెల్లకొండలకు పోయినాడు. అక్కడ వాని భార్య కానరాలేదు.

మునుసామి నానాటికి ధనము గడించడము మొదలు పెట్టినాడు. నాలుకు ఇంత లుచ్చేపద్ధతిమీద తనకు తెలియకుండా అడవిసరకు తెచ్చుకొనవచ్చునని లోపాయికారిగా అడవిమనుష్యులతో రాజీ పడ్డాడు. కేసులు తక్కువైనవి. అధికారి సామర్థ్యమునకు దొరతనము సంతోషించినది.

అది విషజ్వరముల కాలము. ఊరూరా, దేశదేశములా విషజ్వరములే. ఎందరో దాని వాతబడిరి. మునుసామి యింట ప్రవేశించినది విషజ్వరము. భార్యా బిడ్డపిల్లలూ పదిరోజులలో ఎగిరిపోయినారు.

మునుసామి ఒక్కడు, నా అన్న వాడు లేడు. ధనమునే ముఖ్యముగా చూచుకొ మొదలుపెట్టినాడు

క్రమక్రమముగా మునుసామి ప్రవర్తన పైఅధికారులకు తెలియవచ్చినది. విచారణ జరిగినది. మునసామిని ఉద్యోగమునుండి తొలగించిరి.

చిన్ననాటి బంధువులతోను, మిత్రులతోను జీవితము గడపవచ్చునని స్వగ్రామము పోయినాడు మునిసామి. మిత్రబంధుకోటి ఆగ్రామమున నతనికి కరవైనది

